# సోవియట్ సమీక్ష




నికరమైన నిరాయుధీకరణకు
సోవియట్ యూనియన్ అనుకూలం

నూతన సార్వత్రిక సామాజికవిధానం

ఆకలి బాధ: ప్రపంచవ్యాప్త విషాదగాథ

స్టాలిన్: ఒకవిశ్లేషణ

# సంబంధాలు







ఈనాడు అంతర్జాతీయ సంబంధా లు అభివృద్ధిచెందుతున్నాయి. చిత్రసీమకు చెందిన ప్రసిద్ధ నటీనటులు : రాబర్ట్ డినిరో (అమెరికా), పార్వతీ మీనన్ (భారత్), హన్నా ఫిగుల్లా (ఫెడరల్ జర్మనీ), అలెస్ అదమోవిచ్ (సోవియట్)

'అమెరికా' అనే చలనచిత్ర నిర్మాణ బృందంలో ఒకరు అయిన జాన్ లుగార్ సోవియట్ యూనియన్‌లో

నొవొసిబిర్స్కలోని ఇంగ్లీషు సాహిత్యాభిమానుల క్లబ్ సభ్యులతో గ్రాహమ్ గ్రీనె.

# సోవియట్ సమీక్ష

3

సంపుటి 22

మార్చి

1988

సంపాదకుడు :
వై. ఎల్. ఫ్రొలోవ్
సంయుక్త సంపాదకుడు :
జి. ఆళవందార్
సహాయ సంపాదకుడు
మునగాల జనార్దన రెడ్డి
ఆర్టిస్ట్
ఎల్. వి. గుసేవ

●

పుటలరూపరచన
వి. వల్యాకవ్

●

11 భారతీయ భాషల్లో వెలువడే పత్రిక

●

SOVIET SAMEEKSHA - (Telugu)

●

అంతర్జాతీయ
మహిళాదినోత్సవాన్ని
మొదట 78 యేండ్ల క్రితం
జరుపుకున్నారు.
ప్రపంచ సామాజిక
పునరుజ్జీవానికీ,
మహిళల విముక్తికీ
మధ్య గల
సన్నిహిత సంబంధాన్ని
యిది సర్వదా ప్రతిబింబించింది.
భూమ్మీద శాంతికోసం,
సౌభాగ్యం కోసం,
ప్రాణికోటి మనుగడ
కోసం
అంతర్జాతీయ మహిళల సంఘీభావం
దినంగా
యీవుత్సవాన్ని యీనాడు
జరుపుకుంటున్నారు.



ఈ సంచికలోని చిత్రాలు, వ్యాసాలు
నొవొస్తి వార్తా సంస్థవి

●

Printed by A.N.Kazantsev and Published by him at Soviet Nadu Office, 115, Theagaraya Road– Madras-600 017, (Phone:440201), for the Information Department of the USSR Embassy in India. Printed at Pavai Printers (P) Ltd., 142, Jani Jan Khan Road, Madras-600014.

1

# ఈ సంచికలో

సంక్లిష్టమైన సైద్ధాంతిక, ఆచరణాత్మక సమస్యలను పరిష్కరించినందుకు 1987 ప్రభుత్వ బహుమతి సోవియట్ విజ్ఞానశాస్త్ర వేత్తల నిపుణుల **బృందానికి** లభించింది.





## 14



## 38



అకడమీషియన్ [illegible]

[illegible]

సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకడమీ కరెస్పాండింగ్ సభ్యుడు, యితర రచయితలు, సోవియట్ శాస్త్ర, సాంకేతి. జ్ఞులు సాధించిన విజయాలను గురించి వివరించారు.

## 55



అకడమీషియన్

# టి. జాస్లావ్స్కయా.

సమస్త జీవితరంగాల్లో "పెరిస్త్రోయికా" విజయానికి హామీ కల్పించేందుకు ఒక కొత్త సార్వత్రిక సామాజిక విధానం అవసరం. దీని పరిధి గత సామాజిక విధానానికి గల పరిధి కన్నా చాలా విస్తృతమైనదిగా వుండాలి అని అంటు న్నారు టి. జాస్లావ్స్కయా, ఆర్థికవేత్త ఎ. శపోష్నికవ్.

# సోవియట్ కొత్త పుస్తకాలు






**భారతదేశంకోసం భారతదేశం గురించిన సోవియట్ కొత్తపుస్తకాలు**

భారతదేశ సంస్థల ఆర్డర్లను పురస్కరించుకొని యేటా సోవియట్ ప్రచురణ సంస్థలు 250 కి పైగా టైటిల్స్‌తో 12 భారతీయ భాషల్లోనూ దాదాపు 300 టైటిల్స్‌తో యింగ్లీషులోనూ సోవియట్ రచయితల పుస్తకాలను ప్రచురిస్తున్నాయి.

# నికరమైన నిరాయుధీకరణకు సోవియట్ యూనియన్ అనుకూలం

స్పార్తక్ బెగ్లోవ్
నొవొస్తి రాజకీయ విశ్లేషకుడు

నిరాయుధీకరణ పాశ్చాత్య దేశాలకు "వినాశకరమైన పర్యవసానాలు" తెచ్చి పెడుతుందని ప్రజల్ని వుద్దేశపూర్వకంగా భయపెడుతున్న నాటో "నియమిత మేధావుల"ను ఫిబ్రవరి 18 న సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశంలో ప్రసంగిస్తూ మిహయీల్ గొర్బచేవ్ విమర్శించారు.

అమెరికా విదేశాంగ మంత్రి జార్జి షుల్జ్ మాస్కోకు వచ్చినప్పుడు సోవియట్ పక్షం ఈ "నిరోధక యంత్రాంగాన్ని" గురించి నిర్మొహమాటమైన అంచనాను యివ్వనుంది. యూరప్‌లో మొహరించిన అణ్వాయుధాలను సాంప్రదాయిక ఆయుధాలతో సమానంగా తగ్గించడానికీ, సోవియట్, అమెరికాల వ్యూహాత్మక దాడి ఆయుధాలను సగానికి సగం తగ్గించే సంధిని రూపొందించడానికీ యీ "నిరోధక యంత్రాంగం" ఆటకం కలిగిస్తోంది.

నిజమైన నిరాయుధీకరణ దిశలో తొలి అంజ అని ప్రాచ్య, పాశ్చాత్య ప్రపంచాలు ఐ.ఎన్.ఎఫ్ సంధిని యేకగ్రీవంగా ప్రస్తుతించినప్పటికీ, తర్వాతి చర్యల విషయంలో భిన్నాభిప్రాయం అంతకంతకూ యెక్కువగా స్పష్టమవుతోంది. ఐ.ఎన్.ఎఫ్ సంధి తర్వాత, అన్నియితర రకాల అణు, సాంప్రదాయిక ఆయుధాల విషయంలో కూడా యిలాంటి చర్యలు తీసుకోవాలన్న భావంతో మాస్కో వ్యవహరిస్తోంది. కాగా నాటో తన నూతన పునరాయుధీకరణ కార్యక్రమాలలో ఈ సంధివల్ల జరిగిన "నష్టాన్ని పూడ్చుకోవాలి" అని పాశ్చాత్య దేశాల నాయకులు కోరుతున్నారు.

ఐ.ఎన్.ఎఫ్ సంధి తొలి చర్య మాత్రమేననీ, దీనితర్వాత, యితర చర్యలు తీసుకోవాలని కూడా గొర్బచేవ్ క్రెమ్లిన్‌లో చెప్పారు. అదేరోజున పశ్చిమజర్మనీ ఛాన్సలర్ హెల్మట్ కోల్‌కు అమెరికా నాయకులు వాషింగ్టన్‌లో స్వాగతం చెబుతూ అణ్వస్త్రాల విషయంలో బాన్‌కు మరింత ఆసక్తి కలిగించడమే తమకు ప్రధానమని యెలాంటి దాపరికం లేకుండా చెప్పారు. పశ్చిమ జర్మనీలో నూతన తరం అణ్వాయుధాల మొహరింపు జరగనిదే ఆ దేశం మనజాలదన్న అభిప్రాయాన్ని కలిగించడానికి అమెరికా నాయకులు ప్రయత్నించారు. ఈ విధంగా, తమ దేశం అణుయుద్ధ రంగస్థలం కాక తప్పదని పశ్చిమ జర్మనీవారికి అన్యాపదేశంగా చెప్పారన్నమాట. యూరప్‌లో యితర రకాల - సముద్రస్థిత, వాయుస్థిత - అణ్వస్త్రాలను అధికాధికంగా నెలకొల్పాలన్న యోచన కూడా వుంది. ఐ.ఎన్.ఎఫ్. సంధి ప్రకారం నిర్మూలించే భూస్థిత క్రూయిజ్ మిసిలీల కన్నా యెక్కువ

సంఖ్యలో సముద్రస్థిత, గగనస్థిత అణ్వాయుధ వాహకాల మోహరింపు ప్రమాదం బ్రిటిష్ దీవులకు యేర్పడనుంది.

జార్జి షుల్జ్ మాస్కో సందర్శన దృష్ట్యా, త్వరలో జరగనున్న నూతన సోవియట్-అమెరికా శిఖరాగ్ర సమావేశం దృష్ట్యా జెనీవా సంభాషణల్లో పురోగతి అవసరం. అయితే యిదేమీ కనిపించడంలేదు. రీగన్ - గొర్బచేవ్ వాషింగ్టన్ ప్రకటనలోని స్పష్టమైన భావాలకు విరుద్ధంగా, ఎ బి ఎం. సంధిని ఆచరణలో దెబ్బతీసే "వ్యూహాత్మక రక్షణ" ముసాయిదా ఒప్పందాన్ని అమెరికా ప్రతినిధివర్గం జెనీవా సంభాషణలో ప్రతిపాదించింది.

ఐ సి బి ఎం ల ఉపస్థాయిలకు సంబంధించిన అమెరికన్ల నూతన డిమాండ్లు గానీ, దీర్ఘ శ్రేణి సముద్రస్థిత క్రూయిజ్ మిసిలీలపై గరిష్ఠ పరిమితుల విధింపును చర్చించ నిరాకరించడంగానీ, వ్యూహాత్మక దాడి ఆయుధాలను సగానికి సగం తగ్గించేందుకు జరుగుతున్న సంభాషణలు ఫలప్రదం కావడానికి తోడ్పడవు.

తన మాస్కో సందర్శనకు ముందు జార్జి షుల్జ్ తన అభిమాన సిద్ధాంతాన్ని పునశ్చరణ చేశారు. సోవియట్ - అమెరికా సంబంధాల మెరుగుదల, వాటి మధ్య "పోటీ"లేకుండా చేయదనేదే యీ సిద్ధాంతం. ఇది ఆయుధ నియంత్రణను, పునరాయుధీకరణను మిళితం చేసే ప్రయత్నమేకదా?

అందుకే మిహాయిల్ గొర్బచేవ్ తన క్రెమ్లిన్ ప్రసంగంలో, రాజకీయాంశాలేగాక భావజాల. సామాజిక అంశాలు కూడా నిరాయుధీకరణోద్యమంలో అంతకంతకూ బలంగా ప్రస్ఫుటమవుతున్నాయని చెప్పారు.

"'ప్రయోజనాల సమతూకం', పరస్పర సమాన భద్రత, అన్న భావనల్తో, బలప్రదర్శనా రాజకీయాలు ప్రాతిపదికగా గల సైనిక సిద్ధాంతాన్ని మనం వ్యతిరేకిస్తున్నాము. మన రాజకీయ ప్రయోజనాలు ఇతర దేశాల ప్రయోజనాలకుగానీ, యే యితర సమాజంలోని శ్రామిక ప్రజల ప్రయోజనాలకు కానీ విరుద్ధంకావు" అని అన్నారాయన.

సైనిక తత్వ నిర్మూలన మరీ కరుడుగట్టిన అభివృద్ధి నిరోధక శక్తులను అడ్డుకొట్టడానికి తోడ్పడటమేగాక సర్వత్రా మరిన్ని యెక్కువ ఉద్యోగాలను సృష్టిస్తుంది కూడాను.

తీవ్రరూపం ధరించిన, ప్రపంచ సమస్యల పరిష్కారానికి అంతర్జాతీయ సహకారం ఆవశ్యకమన్న గుర్తింపు శాంతి, నిరాయుధీకరణ ఉద్యమానికి దోహదం చేస్తాయని మాస్కో అభిప్రాయం.

సోవియట్ యూనియన్‌లో అమలు జరుగుతున్న పెరిస్త్రోయికా, నూతన తరహా రాజకీయ ఆలోచనా ధోరణి సోవియట్ వ్యతిరేకతను సడలింప జేస్తున్నాయి; సోవియట్ యూనియన్ పట్ల "శత్రుభావాన్ని" నశింపజేస్తున్నాయి; వేరు మాటల్లో చెప్పాలంటే దశాబ్దాల తరబడిగా సైనికతత్వం వేటిపై ఆధారపడి తన స్థానాలను పటిష్టం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నదో వాటిని నాశనం చేస్తున్నాయి. మిహాయిల్ గొర్బచేవ్ పర్యటన వలన సోవియట్-అమెరికా సంబంధాల్లో యేర్పడిన వాతావరణం కొంతమందికి గిట్టడంలేదు. అయితే, నూతన ఆలోచనాధోరణి ఆధునిక ప్రపంచ వాస్తవాలనూ ప్రాధాన్యతలనూ, సరిగా ప్రతిబింబిస్తున్నది. అందువల్ల యిది మనకేగాక, యావత్ ప్రపంచానికి కూడా నప్పుతుందని మనం భావిస్తున్నాము, అని గొర్బచేవ్ నొక్కి చెప్పారు.

# శాంతి కోసం సమైక్య కృషి

యెవగెని అలెక్సాండ్రోవ్

ఈ దశాబ్దంలోని మిగతా సంవత్సరాలకూ, ఆ తర్వాత కాలానికి వుద్దేశించిన దేశ అంతరంగిక, విదేశాంగ విధాన కార్యక్రమాన్ని సోవియట్ సమాజ అగ్రగామిశక్తి, మార్గదర్శక శక్తి అయిన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ తన 27వ మహాసభలో స్థూలంగా రూపొందించి యిప్పటికి రెండేళ్ళవుతోంది. సత్వరసామాజిక, ఆర్థిక ప్రగతిని ప్రాథమ్య లక్ష్యంగా యీ మహాసభ నిర్దేశించుకుంది. అణుయుద్ధ ప్రమాదాన్ని తొలగించేందుకూ, ఆయుధ పోటీని అంతమొందించేందుకూ, ప్రపంచ శాంతిని పరిరక్షించి పటిష్టం చేసేందుకూ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ అంతర్జాతీయ వ్యూహాన్ని కేంద్రీకరించేలా ప్రేరేపించింది కూడా అదే.

కాబట్టి, మహాసభలో ప్రకటించినట్టుగా చరిత్ర పథం, సామాజిక ప్రగతి—యివి ప్రపంచవ్యాపంగా జాతుల, దేశాల ప్రజల మధ్య యిశోధిక నిర్మాణాత్మక సహకార అవశ్యకతను నొక్కి చెపుతున్నాయి.

మరింత సురక్షితమైన శాంతి కోసం యిలాంటి సంఘీభావానికి సోవియట్ భారత సంబంధాలు సముచితమైన, సమర్థమైన, ఫలప్రదమైన ఉదాహరణ.

సోవియట్ - భారత సంబంధాలు భిన్న సామాజిక - ఆర్థిక వ్యవస్థలుగల దేశాల మధ్య వుండాల్సిన సంబంధాలకు ఆదర్శప్రాయమైనవీ, శాంతియుత సహజీవన లెనినిస్టు సూత్రాలకూ, జవహర్‌లాల్ నెహ్రూలాంటివారు బాటవేసిన అలీన విధానానికీ ఆచరణాత్మక మూర్తీభావమూను. ఈ సంబంధాలను ఆదర్శప్రాయంగా చేస్తున్న దేమిటి? చాలా వున్నాయి. మొట్టమొదటిది, సోవియట్ - భారత మైత్రి మనదేశాల ప్రజల మౌలిక ప్రయోజనాలకు అనుగుణమైనది. ఇది కాలపరీక్షకు తట్టుకుని నిల్చిన మైత్రి.

శాంతి, నిరాయుధీకరణ, అభివృద్ధులకు పరస్పర సంబంధం వుందన్న ఉమ్మడి అవగాహనే సోవియట్ యూనియన్ భారతదేశాలను సన్నిహితం చేస్తున్నది.

ఆసియాలో పరిస్థితిని కుదుటపరచడానికి వీలైన మార్గాలపట్ల నూతన దృక్పధం తక్షణావసరమని మిహాయిల్ గొర్బచేవ్ నొక్కి చెప్పింది, 1985 మే నెలలో జరిగిన సోవియట్ - భారత శిఖరాగ్ర సమావేశంలోనే నన్న విషయం గమనార్హం. 1986 జనవరి 15 న మిహాయిల్ గొర్బచేవ్ తన ప్రకటనలో యీ శతాబ్దాంతంనాటికల్లా అణ్వస్త్రాల, రసాయనిక ఆయుధాల నిర్మూలనకు సంబంధించిన సోవియట్ కార్యక్రమాన్ని ప్రతిపాదించారు. ఈ ప్రకటన యిలా నొక్కి చెబుతోంది: ఈ కార్యక్రమం అమలుజరిగితే అది "ఆసియాలోని పరిస్థితినే మౌలికంగా మార్చివేస్తుంది. ఆ ప్రాంతంలోని దేశాలను సైతం అణు, రసాయనిక. యుద్ధ ప్రమాద భయంనుండీ విముక్తం చేస్తుంది. ఆ మండలంలో గుణాత్మకంగా కొత్తదైన స్థాయిలో భద్రతను నెలకొల్పుతుంది."

మిహాయిల్ గొర్బచేవ్ 1986 లో వ్లాదివొస్తోక్ లోనూ, ఢిల్లీలోనూ చేసిన ప్రసంగాలలో, 1987 లో మెర్దెకా వార్తాపత్రికకు యిచ్చిన ఇంటర్వ్యూలోను, ఆసియా, పసిఫిక్ మండలంలో శాంతి, సహకారాలకు హామీనిచ్చే ఒక విస్తృత పథకాన్ని ప్రతిపాదించారు. ప్రత్యేకించి. ప్రాంతీయ సమస్యల పరిష్కార మార్గాలను కనుగొనడానికీ, యీ మండలంలో అణ్వస్త్రాల విస్తరణను, వాటి వ్యాప్తిని నిలవరించడానికీ పసిఫిక్‌లో నౌకాదళ కార్యకలాపాల తగ్గింపుపై సంప్రతింపులను ప్రారంభించడానికీ, హిందూ మహాసముద్ర మండలాన్ని శాంతిమండలంగా చేయడంపై సంభాషణలను పునరుద్ధరించడానికీ సంయుక్త కృషి సల్పవలసిందిగా సోవియట్ యూనియన్ ప్రతిపాదించింది.

ఢిల్లీలో అంతర్ ఆసియా సంబంధాలపై 40 యేళ్ళ క్రితం జరిగిన ప్రథమ సమావేశాన్ని యీ సందర్భంగా వుదహరిస్తాను. ఈ సమావేశ ప్రారంభోపన్యాసంలో జవహర్‌లాల్ నెహ్రూ యిలా చెప్పారు: "ఈ సమావేశంలో, ఈ కృషిలో నాయకులంటూ యెవరూ లేరు. ఒక ఉమ్మడి కర్తవ్య సాధనలో, కృషిలో సమస్త ఆసియా దేశాలూ కలిసి కట్టుగా సమాన ప్రాతిపదికపై పాల్గొనాల్సి వుంది....మనది ప్రపంచమంతటా శాంతి, ప్రగతులను పెంపొందించాలన్న మహదాశయం."

నెహ్రూ చెప్పినట్టుగా "ఒక ఉమ్మడి కర్తవ్యాన్ని, ఒక ఉమ్మడి కృషిని నెరవేర్చడంలో సమాన ప్రాతిపదికపై" ఆసియా దేశాలు కలిసి పాల్గొనడమనేది ఆసియా, పసిఫిక్ మండలంలో శాంతి భద్రతలకు హామీనిస్తుంది. యిది సోవియెట్ ప్రతిపాదనకు ప్రాథమిక సూత్రం.

సోవియట్ యూనియన్, భారతదేశాల ప్రజల మైత్రి ఉభయదేశాలకు ప్రయోజనకారి; అంతేకాదు, సోవియట్ యూనియన్, భారతదేశాల సహకారం, శాంతి శక్తికి గణనీయమైన దోహదం చేస్తోంది. రాజీవ్ గాంధీ చెప్పినట్టుగా యిది "ప్రపంచ శాంతి, భద్రతలకు ఒక ముఖ్యకారకం."

మిహాయిల్ గొర్బచేవ్ ఢిల్లీ సందర్శన, రాజీవ్‌గాంధీ మాస్కో సందర్శన, నికొలాయ్ రిష్కోవ్ భారతదేశ సందర్శన, రెండుదేశాల యితర నాయకులనేకులు జరిపిన పరస్పర దేశ పర్యటనలు, సోవియట్ యూనియన్ లోనూ, భారతదేశంలోనూ జరుగుతున్న ప్రధాన ఉత్సవాలు—యివన్నీ యీ సంబంధాలకు మరింత పుష్టి చేకూర్చుతున్నాయి; సుసంపన్నం చేస్తున్నాయి; వాటిని ఉన్నత స్థాయికి తీసుకు వెడుతున్నాయి.

శాంతి, స్నేహ, సహకారసంధి కలిపి

కట్టిన సోవియట్-భారత సంబంధాలకు ఢిల్లీ ప్రకటన సమున్నత శిఖరం. యిది అణ్వస్త్ర రహిత, హింసారహిత ప్రపంచ సూత్రాలను చాటి చెప్పింది.

దేశ దేశాల ప్రతినిధులు ఐరాసలో అనుకూలంగా ఓటుచేస్తూ వచ్చిన నిరాయుధీకరణ తీర్మానంలో, అంతరిక్షంలో ఆయుధాల ప్రవేశాన్ని అరికట్టే తీర్మానంలో గల ఆలోచనలనూ, అలీనోద్యమ ప్రతిపాదనలనూ, భారతదేశం, అర్జెంటీనా, గ్రీస్, మెక్సికో, టాంజానియా, స్వీడన్ దేశాల నాయకుల చొరవలనూ ఢిల్లీ ప్రకటనలో పొందుపర్చారు. యిటీవలనే ప్రాంతీయ, ఆర్థిక సమస్యలపై దృష్టి కేంద్రీకరించి, యిప్పుడు శాంతికోసం, అణుయుద్ధ నివారణకోసం సాగే పోరాటంలో బలమైన సానుకూల శక్తిగా రూపొందిన అలీనోద్యమ చొరవలూ, ఆరుదేశాల ప్రతిపాదనలూ నేటి అంతర్జాతీయ వ్యవహారాల్లో గణనీయమైన పరిణామమయ్యాయి.

"ఢిల్లీ ప్రకటన అపూర్వమైనది. అంతర్ రాజ్య సంబంధాలపట్ల పూర్తిగా కొత్త తాత్విక రాజకీయ వైఖరిని యిది ప్రదర్శిస్తోంది ఈ అణు, అంతరిక్షయుగంలో సార్వత్రిక మానవతా విలువల ప్రధాన్యత గుర్తింపుదానికి తాత్విక, నైతిక పునాదిగా వుంది. ఈ పత్రాన్ని రెండు దేశాలు మాత్రమే రూపొందించినప్పటికీ, దీని ప్రాముఖ్యత ద్వైపాక్షిక, ప్రాంతీయ పరిధులను మించిపోయింది" అని మిహాయిల్ గొర్బచేవ్ పేర్కొన్నారు.

మరో విషయం. ఈ పత్రంపై సంతకాలు జరిగిన తర్వాత, కాలగతితో దీని ప్రాముఖ్యం తగ్గకపోగా పెరుగుతోంది. ఇది యీ పత్రానికి విశిష్టతను సంతరించి పెడుతోంది.

సోవియట్ - అమెరికా సంధి యింగితజ్ఞానానికి విజయం, నూతన రాజకీయ ఆలోచనా సరళికి, ప్రపంచ శాంతి శక్తులకు విజయం. సోవియట్ యూనియన్, భారతదేశమూ ఉమ్మడిగా దీనికి విశిష్ట దోహదం చేశాయి.

మానవాళికి భవిష్యత్తుపై కలిగిన ఆశాభావాన్ని పెంపొందించడానికి ఉమ్మడిగా యావచ్ఛక్తితో కృషి చేయడం అవసరం. ఈ అర్థంలో సోవియట్ - భారత సంబంధాలు, వాటి స్నేహం గణనీయమైన పాత్ర వహించాల్సి వుంది. యెందువల్లనంటే, "సోవియట్ యూనియనూ, భారతదేశం మంచి అంతర్ ప్రభుత్వ సంబంధాలకు ఒక దృష్టాంతం. ఇతరులు అనుసరించవలసిన ఒక దృష్టాంతం. మన సంబంధాల్లో ఒక ప్రపంచ వ్యవస్థ ఆవిర్భావం కనిపిస్తోంది; అందులో శాంతియుత సహజీవనం, సత్సంకల్పం ప్రాతిపదికగా గల పరస్పర ప్రయోజనకర సహకారం సార్వత్రిక క్రమంగా వుండగలవు."

మిహాయిల్ గొర్బచేవ్ అన్న యీ మాటలు సోవియట్ యూనియన్, భారత దేశాల మధ్య సంబంధాలూ, శాంతి ఆశయానికై అణు యుద్ధ నివారణకై, అణ్వస్త్ర రహిత హింసారహిత ప్రపంచ నిర్మాణానికై వాటి కృషి యెంత ముఖ్యమైనవో విదితం చేస్తున్నాయి. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 27 వ మహాసభ నిర్దేశించిన మహా లక్ష్యాన్ని సాధించేందుకు ఈ సంబంధాలు తోడ్పడతాయి. ఆ లక్ష్యమిది: "ఎట్టి పరిస్థితుల్లోనైనా సరే, యుద్ధ నివారణకోసం పోరాడటంలో విజయం సాధించాలి. యిది సమస్త మానవాళికి, ప్రపంచంలోని ప్రతి ఒక్కరికి, ఒక నూతన యుగారంభక విజయం కాగలదు."

సోవియట్ భారత సంబంధాలు: నిన్న, నేడు, రేపు

# ఉమ్మడి అవగాహన కోసం అన్వేషణ

సెర్గీ సెరెబ్రియాని

అణ్వస్త్ర రహిత, హింసారహిత ప్రపంచ సూత్రాల గురించిన ఢిల్లీ ప్రకటన నేపధ్యంలో సోవియట్ యూనియన్ భారత దేశాలు సాంప్రదాయ సిద్ధమైన సహకారం నెరపుతున్నాయి. ఈ ప్రకటనపై 1986 నవంబరు 27 న మిహాయిల్ గొర్బచేవ్, రాజీవ్ గాంధీలు సంతకాలు చేశారు. సోవియట్ యూనియన్‌లో భారతదేశ వుత్సవం, భారతదేశంలో సోవియట్ యూనియన్ వుత్సవం—యివి యీ పత్ర ప్రాధాన్యతను సుస్పష్టం చేస్తున్నాయి.

ఢిల్లీ ప్రకటన ప్రాముఖ్యాన్ని దాని నిజమైన విలువకు అనుగుణంగా యింకా మదింపు వేయాల్సి వుందనుకొంటున్నాను. వాస్తవ పరిస్థితులకు అనుగుణమైన "నూతన రాజకీయ ఆలోచనా ధోరణి", నూతన రాజకీయ అవగాహనల కోసం జరిగిన సంయుక్త అన్వేషణ ఫలితమే యీ పత్రం.

నేను దీనిలోని కొన్ని కీలక భావాలను మాత్రమే పేర్కొంటాను.

ఈ ప్రకటనలోని అధిక భాగం సోవియట్ ప్రజలమైన మనకు కొత్తదీ, అసాధారణమైనదీను. ఇందులోని "సర్వజనాంగీకృతమయిన విలువలకు ప్రపథమ ప్రాధాన్యం యివ్వడం" అన్న సూత్రం తీసుకుందాం. "వర్గ దృక్పథం" అత్యంత ఆవశ్యకమయినదనీ, "నైరూప్య మానవతా వాదం" ఆమోదయోగ్యం కాదనీ మనం అతి తరచుగా వింటూ వుండేవాళ్ళం. "సర్వజనాంగీకృతమయిన మానవ విలువలు" అంటే ఏమిటి? యీ అర్థంలో అసలు "విలువ" అన్న పదమే మన పరిభాషకు కొత్తది. "విలువ" భావనను ప్రధానంగా జర్మన్ తత్వవేత్తలు 19—20 వ శతాబ్దాల్లో ప్రవేశపెట్టి విశదీకరించారు. ఆ తర్వాత, దీన్ని సామాజిక శాస్త్రజ్ఞులు - పశ్చిమ యూరప్, అమెరికాలవారు - అరువు తీసుకొన్నారు. విలువల సిద్ధాంతాన్ని "బూర్జువా తత్వవేత్తల" కట్టుకధ అని చాలాకాలంపాటు మనం నమ్మాము. అయితే, 1950 ల చివరి నుండీ సోవియట్ తత్వవేత్తలు కూడా విలువలకు సంబంధించిన సమస్యలను అధ్యయనం చేయడం మొదలుపెట్టారు. ఇప్పుడు పెరెస్త్రోయికా కాలంలో-అనేక విలువలను తిరిగి మదింపు వేస్తున్నారు. కాబట్టి యిది నేటి ప్రధానాంశం అవుతోంది.

ఢిల్లీ ప్రకటన రష్యన్, ఇంగ్లీషు భాషలు రెంటిలోను ఏకకాలంలో వెలువడింది. ఈ

రెండు పాఠాలూ సమానంగా అధికారిక మైనవే. అయితే, అసలు "సర్వజనాంగీ కృతమైన మానవ విలువలు" అన్న పదం లోనే రెండు పాఠాలకూ మధ్య కొంచెం భేదం వుంది. ఇంగ్లీషు పాఠంలో ఒక విధంగా నిర్దిష్ట "మానవ విలువల" సముదాయం, అంటే సమస్త ప్రజలు సమస్త రాజ్యాలూ ఆమోదించిన చైతన్యపు ప్రామాణిక సూత్రాలు యిప్పటికే అస్తిత్వంలో వున్నాయన్న అభిప్రాయం వుంది. రష్యన్ పాఠంలో "సార్వజనీన విలువలు" అన్న మాట మాత్రమే వుంది; ఈ విలువలు యిది వరకే వున్నాయా, లేవా అన్న ప్రశ్న అలాగే వుండిపోయింది. అంటే రష్యన్ పాఠం ఒక సార్వజనీన మానవ విలువల సముదాయాన్ని రూపొందించే కర్తవ్యాన్ని నిర్దేశిస్తోందన్నమాట. నా భాష్యం సరియైనదే అయితే నిజానికి సార్వత్రిక ఆమోద్యం పొందిన మానవ విలువలు యింత వరకూ ఆట్టే లేవు. వీటి ప్రాతిపదికపై ప్రపంచ వ్యాప్త సుస్థిర మానవ కుటుంబాన్ని నిర్మించాల్సి వుందన్న సోవియట్ వైఖరి మరింత వాస్తవికమైనదని చెప్పవచ్చు.

మిహాయిల్ గొర్బచేవ్, రాజీవ్‌గాంధీలు సార్వజనీన మానవ విలువలను వ్యక్తంచేసే రూపంగా, హక్కులకు సంబంధించిన విషయాలకు మళ్ళడం గమనార్హం. ఢిల్లీ ప్రకటనలోని కింది మూడు పదజాలాల అంతరార్థమేమిటో తెలుసుకొందాం:

"జీవించేందుకు, స్వేచ్ఛకు, శాంతికి, సుఖపడటానికి ప్రపంచంలోని ప్రతి ఒక్క దేశానికి, ప్రతి మనిషికి గల హక్కునూ గుర్తించాలి. బలప్రయోగాన్ని, బలప్రయోగం చేస్తామన్న బెదిరింపును విసర్జించాలి. తమ కిష్టమైన సామాజిక, రాజకీయ,సైద్ధాంతిక పరమయిన ఎంపికలకు ప్రతి దేశ ప్రజకు గల హక్కును గౌరవించాలి." యిక్కడ, ప్రతిదేశ ప్రజల్లో "ప్రతి మనిషి" అన్న భావం కూడ అంతర్లీనంగా వుంది. (ఎస్. ఎస్.) యీ మొదటి పదజాలం అమెరికా స్వాతంత్ర్య ప్రకటనలోని ప్రసిద్ధ పదాల పరిణత రూపమే.

రెండవది, అహింసా సూత్రాన్ని మరో విధంగా ప్రతిపాదించినదే. మూడవది, బహువిధమయిన సామాజిక, రాజకీయ, సైద్ధాంతిక వ్యవస్థలు ఆధునిక ప్రపంచంలో అనివార్యమని గుర్తిస్తోంది. యిది మొదటి ప్రతిపాదనకు సహజమైన కొనసాగింపే. ఎందువల్లనంటే, జీవించేందుకు, స్వేచ్ఛ, శాంతులకు, సుఖంగా వుండేందుకు ప్రతి దేశానికీ, ప్రతి మనిషికీ హక్కుందని మనం నిజంగా గుర్తించినట్లయితే, యెలా జీవించాలి, యెలాంటి స్వేచ్ఛా సుఖాలు అనే విషయాలపై వేరు వేరు దేశాలకూ, వేరు వేరు వ్యక్తులకు వేరు వేరు అభిప్రాయాలుంటాయని అంగీకరించక తప్పదు. అందువల్ల బహువిధ వ్యవస్థలు అనివార్యం - బహువిధ వ్యవస్థలున్న ప్రస్తుత దశలో విశ్వమానవ ఐక్యత నెలకొనవలసిన అవసరముంది. బహురూపతా వ్యవస్థలున్న పరిస్థితులలో, ఐక్యత నెలకొని వుండాలంటే, "సమాజ జీవితానికి అహింస ప్రాతిపదికగా వుండాలి" అనేది స్వయం విదితమే.

ఢిల్లీ ప్రకటనలోని పది సూత్రాలలో మూడవది యిలా వుంది: "సమాజ జీవితానికి హింసారాహిత్యం ప్రాతిపదికగా వుండాలి. హింసపైనా, బెదిరింపులపైనా ఆధారపడిన తాత్వికతలూ, విధానాలు నీతి బాహ్యమైనవీ, అనుమతించరానివి. అవి అసహనాన్ని వ్యాపింపజేస్తాయి. మానవుని ఉదాత్త మనోభావాలను నాశనం చేస్తాయి. మానవ విలువల నన్నిటిని ధ్వంసం

చేస్తాయి."

"యిప్పటి వరకూ వున్న సమాజాల చరిత్ర వర్గపోరాటాల చరిత్రే" అని కమ్యూనిస్టు ప్రణాళిక చెబుతున్నది. యిప్పటివరకూ గడిచిన చరిత్ర కొందరు యితరులపైన, కొన్ని సామాజిక బృందాలు, యితర బృందాలపైన, కొన్ని దేశాలు, యితర దేశాలపైన సాగించిన హింసాకాండే అని చెప్పవచ్చు. విజ్ఞానవంతు లయిన 19 వ శతాబ్ది యూరోపియన్లు సైతం హింసను ఒక ఆరాధ్యసూత్రంగా చేశారు. "మన కాలం నాటి ముఖ్య సమస్యలు కత్తితో, రక్తపాతంతో పరిష్కార మవుతాయ"ని 1862 లో బిస్మార్కు చెప్పారు. ఆనాటి రాజకీయ వేత్తల్లోని అధిక సంఖ్యాకులకు అదే అభిప్రాయం ఉండేది.

19 వ శతాబ్దిలో యూరపియన్లు సామ్రాజ్యాలను స్థాపించారు. హింస ప్రగతికి సాధనమని నమ్మారు. అయితే ఆ శతాబ్దాంతం నాటికే రష్యాలో లియోటాల్‌స్టాయ్, భారతదేశంలో టాగూరు, వివేకానందుల వంటి సునిశిత దృష్టిగల పరిశీలకులు యీ యూరోపియన్ హింసా ధోరణి ఆత్మహత్యా సదృశమనీ, పెరుకుని పోతున్న ఆయుధాగారాలు యూరపుకే హానికరమని గ్రహించారు.

నిజంగా మొదటి ప్రపంచయుద్ధం యూరపుకు దాదాపు ఆత్మహత్యవంటిదైంది. రష్యన్ సామ్రాజ్యం "బలహీనమైన కొలికి" కాబట్టి యుద్ధభారంతో మొట్టమొదట కుప్ప కూలి పోయింది. జర్మన్, ఆస్ట్రియన్ - హంగేరియన్, ఆటోమన్ సామ్రాజ్యాలకు కూడా తర్వాత యిదే గతి పట్టింది. బ్రిటిష సామ్రాజ్యం కుప్పకూలిపోవడానికి మరో ప్రపంచయుద్ధం అవసరమైంది. మూడవ ప్రపంచ యుద్ధమే వస్తే అది మొత్తం మానవాళినే తుడిచిపెట్టడం ఖాయం. నేటి ప్రపంచ సమస్యలను రాజ్యబలాధిక్యత ద్వారా, హింస ద్వారా పరిష్కరించజాలం.

అందువల్లనే భారతదేశం, సోవియట్ యూనియన్ హింసా రాహిత్యానికై పిలుపు యిచ్చాయి. నిజంగా యీ రెండు దేశాలు యెన్నో బాధలనుభవించే యీ అభిప్రాయానికి వచ్చాయి. తక్కిన సామ్రాజ్యాలలాగానే రష్యన్ సామ్రాజ్యం కూడా హింస ద్వారా సృష్టియైనదే. హింసే దానికి ప్రాపుగా వుండేది. అదృష్టవశాత్తూ రష్యన్ రాజ్య వ్యవస్థకు రష్యన్ సంస్కృతి భిన్నమైనది. వుదాహరణకు, రష్యన్ రాజ్యమనుసరించిన భావజాలాన్ని టాల్‌స్టాయ్ తన ప్రేమ, అహింసామతంతో ఎదుర్కొన్నాడు. ఆయన బోధ రష్యాను కొంతలో కొంత ప్రభావితం చేసినా, 20 వ శతాబ్ది రష్యన్ చరిత్ర గమనం ఆయన బోధలనుసరించ లేదు.

రష్యన్ సామ్రాజ్య శిథిలాలపై భవిష్యత్తులో నిర్దుష్టమైన, హింసారహిత సమాజానికి పునాదులను నిర్మించాలని బోల్షివిక్కులు కలలు గన్నారు. "హింస మన ఆశయాలకు సహజంగానే అన్యమైనది" అని 1916లో లెనిన్ రాశారు. అయితే రాజ్యాధికారానికై జరిగిన తదుపరి పోరాటం కారణంగా గత్యంతరంలేక బోల్షివిక్కులు పెద్ద యెత్తున హింసకు పూనుకోవలసి వచ్చింది. 1920 ల. 1930 లలో స్టాలిన్‌తోసహా మన సిద్ధాంతవేత్తలు, "విప్లవకర హింసను చేపట్టేందుకు కార్మిక వర్గానికి హక్కుంది" అని ప్రకటించారు. యింత స్పష్టంగా చెప్పకపోయినా, ఆ తర్వాత కూడా యీ ఆలోచన యేదో ఒక విధంగా అంతర్లీనంగా వుంటూ వచ్చింది. మనదేశ చరిత్రలోని అన్ని శకాలలోకీ, స్టాలిన్ శకంలో "పరాయివారి" విషయంలో, "తమవారి" విషయంలో హింస

పరాకాష్ట చెందింది. తదుపరి "స్తబ్దతా శకానికి", పేరుకగిన యీ హింస కూడా ఒక కారణం కాదా? దీన్ని వదిలించుకోవాలని మనం యిప్పుడు ఆతురపడుతున్నాం. ఎందువల్లనంటే హింసతో యీ స్తబ్దతను అధిగమించలేమని స్పష్టమైంది. కట్టెలు కొట్టడం, తుదకు ఉక్కు ఉత్పత్తి చేయడం, పంటలు పండించడంలాంటి పనులను కూడా వత్తిడి ద్వారా ప్రజలతో చేయించవచ్చును కాని, అత్యధునాతనమైన ఎలెక్ట్రానిక్ వ్యవస్థలకు రూపకల్పన చేయడం, లేదా, నూతన ఆత్మిక విలువలను సృష్టించడం వంటి కర్తవ్యాలు ముందుకు వచ్చినప్పుడు హింస నిరర్థకమవుతుంది. దీనికి కావలసిన ప్రేరణ మరో రకమయినది. అందుకు హింస నుండి విముక్తి అవసరం. సృజనాత్మక కృషికి స్వేచ్ఛ అవసరం.

మన ప్రస్తుత పెరిస్త్రోయికాను ఒక ప్రత్యేక రకమయిన విప్లవమని అంటున్నారు. ఇదొక హింసారహిత విప్లవంగా మనం భావిస్తున్నామని కూడా నే నంటాను. యిలాంటిది మన చరిత్రలో కనీవినీ ఎరుగం. భారతదేశంలో అహింస ఒక అంగీకృత సిద్ధాంతంగా వుంది. భారతదేశ రాజకీయ నాయకుడు అయిన మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీని (1869-1948) అహింసా సూత్రానికి ప్రతీకగా ప్రపంచంలోని అనేకులు పరిగణిస్తున్నారు.

రాజకీయవేత్తగా మహాత్మాగాంధీ జీవితం విషాదకరంగా అంతమైంది. 1947-48 లో భారతదేశం, పాకిస్తాన్‌గా భారత ఉపఖండం చీలిన తర్వాత పెచ్చరిల్లిన సామూహిక హింసాకాండను ఆయన కళ్ళారా చూచారు. ఆయనే ఒక హిందూ ఉగ్రవాది తూటాకు బలి అయ్యారు. స్వతంత్రభారత రిపబ్లిక్ మహాత్మాగాంధీని "జాతిపితగా" గౌరవిస్తోంది. కాని వాస్తవ రాజకీయాల్లో ఆదర్శవంతమయిన ఆదేశాలను పాటించడం బహు కష్టం ఉదాహరణకు, చైనాతో, పాకిస్తాన్‌తో ఘర్షణ వచ్చినప్పుడు అహింసా సూత్రం భారతదేశానికి వుపయోగపడలేదు.

స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో యెందరి ప్రాణాలనో హరించిన మత కలహాలూ, రాజకీయ టెర్రరిస్టు కార్యకలాపాలూ సాగాయి. ఖలిస్తాన్ పేరిట ఒక స్వతంత్ర సిక్కు రాజ్యాన్ని స్థాపించాలని కలలు కంటున్న సిక్కు ఉగ్రవాదులు యిప్పుడు దేశానికి ఒక అత్యంత క్లిష్ట సమస్యగా తయారయ్యారు. కాబట్టి, నేటి భారతదేశానికి అహింసా వినాదం మునుపటికన్నా మరింత అవసరం.

అహింసా వినాదం హింసాభరితమయిన యావత్తు ప్రపంచానికి కూడా నేడు అవసరం. అహింస అనేది సాధించ వీలులేని కేవల ఆశయంగా మాత్రమే వుంది. అయితే ఆశయాలు ఒక ప్రత్యేక రకమయిన విలువలు. వాటికి వాస్తవ రూపమివ్వగల ఆచరణాత్మక సాధనాలు లేకపోయినప్పటికీ ఆశయాలను చాటి చెప్పవలసిందే. వాటివైపు పురోగమించేందుకు అవి మనకవసరం. ఆశయాలతో వాస్తవాన్ని పోల్చి చూచేందుకు, మన లోపాలను దోషాలను మరిచిపోకుండా వుండేందుకు ఆశయాలను మనముందుంచుకోవాలి.

అంతేకాదు. అహింస అందని మాని పండని మనం అంగీకరించామంటే, ఈనాడు మానవజాతి మనుగడే అసాధ్యమవుతుంది. యెందువల్లనంటే, అహింసా, సహజీవ ప్రమాణాలను-మానవాళి రూపొందించుకుని, సర్వత్రా ఆమోదించడమో, లేక మానవాళే అంతరించటమో: ఇదే నేడు మనముందున్న సమస్య.

## పెరిస్త్రోయికా, గ్లాస్నోస్త్

# నూతన సార్వత్రిక సామాజిక విధానం

మన సమాజంలోని అన్ని జీవిత రంగాలకు పరివ్యాప్తమైన ప్రస్తుత సంస్కరణ కార్యక్రమాన్ని విజయవంతంగా అమలు జరపడానికి యెంతో విస్తృతమయిన సార్వత్రిక సామాజిక విధానం అవసరమని తత్యానా జాస్లావ్స్కయా, అలెక్సాంద్ర్ శపోష్నికవ్ అంటున్నారు. సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ సైబీరియన్ విభాగం తాలూకు ఎకనమిక్స్, పారిశ్రామిక వుత్పత్తి అర్గనైజేషన్ ఇన్స్టిట్యూట్‌లోని సామాజిక సమస్యల శాఖకు జాస్లావ్స్కయా అధిపతిగా, శపోష్నికవ్ డిప్యూటీ అధిపతిగా వున్నారు.

### యెందుకీ మార్పు

సంవత్సరాలుగా మన సమాజంలో పాతుకపోయిన లోపాలు, స్తబ్ధతా కారకాలవల్ల ముఖ్యంగా యిది అవసరమైంది. గత దశాబ్దంలో స్తబ్ధత నెలకొంది; జనాభాలోని కొన్ని బృందాల జీవన ప్రమాణాలు తగ్గాయి. మానవ అవసరాలను క్రమక్రమంగా విస్మరించడం, సామాజిక సంక్షేమాన్ని తెర వెనకకు నెట్టడం, సామాజిక ప్రగతితాలూకు రంగాల్లోని చాలా వాటిల్లో స్వాతంత్ర్యాన్ని, చొరవతో, తెగువతో కూడిన కార్యకలాపాలను అణగదొక్కి, నిరంకుశ పద్ధతుల్లో నియంత్రించడం జరిగింది.

ఈ దేశంలో పనిచేస్తున్న సామాజిక సంస్థలకు హక్కులు, బాధ్యతలు స్పష్టంగా లేకపోవడంవల్ల వ్యక్తులపై చట్టవిరుద్ధ చర్యలకు, అనాగరిక చర్యలకు, ద్రవ్యాపహరణ,

లంచగొండితనం, అవినీతి, ఆశ్రిత రక్షణ లాంటి వ్యతిరేక పరిణామాలకు దారితీసిందని శాస్త్రజ్ఞులంటున్నారు.

## నూతన సమస్యలు

ఆర్థిక మేనేజిమెంటు వ్యవస్థలో మౌలిక మార్పు తక్షణావశ్యకతను గురించి నొక్కి చెబుతూ శాస్త్రజ్ఞులు, ఆర్థిక సంస్కరణ అనేక క్రమాల్లో మౌలిక మార్పుకు దారి తీస్తుందనీ, యీ సంస్కరణవల్ల నూతన సామాజిక సమస్యలు వుత్పన్నమవుతాయనీ, పాత వాటిలో కొన్ని తీవ్రతర మవుతాయనీ చెబుతున్నారు.

ధరలు వేగంగా పెరగడం అనివార్యం, అందువల్ల అనేక సామాజిక బృందాల సంక్షేమ స్థాయిని కాపాడటమూ, పెంచ డమూ కష్టమవుతుంది. ఈ విధంగా పెరిగే అసమానతను తగ్గించగల యంత్రాంగాన్ని నూతన సామాజిక విధానం రూపొందించాలి. ఈ సంస్కరణను యేకరీతిగా అమలు జరపడంవల్ల ఆదాయస్థాయిల మధ్య వ్యత్యాసం పెరుగుతుంది. ఫలితంగా యివి సామాజిక న్యాయసూత్రాలకు అనుగుణంగా వుండేలా చేయడం మరింత క్లిష్టమవుతోంది.

## ప్రాధాన్యతా క్రమాలు

సమాజంలో కొంత మేరకు, ఒకవిధంగా వున్న అసమానతను దృష్టిలో పెట్టుకుని సమాజంలో మనిషి స్థాయిని రూపొందించేందుకు కొన్ని సామాజిక సంస్థలను సృష్టించాలని తత్యానా జాస్లావ్స్కయా, అలెక్సాండ్ర్ శపోష్నికవ్‌ల అభిప్రాయం.

సోషలిజం రూపరహితమైన సర్వ సమతావాద సమాజం కాదు, అని శాస్త్రజ్ఞులు పునరుద్ఘాటిస్తున్నారు. సమానత్వ స్థాయి గురించిన ఆధునిక అభిప్రాయాలకు అనుగుణంగా సామాజిక స్వరూపాన్ని తీర్చి దిద్దే పని నూతన సార్వత్రిక సామాజిక విధానందే అని వారంటున్నారు.

**ముక్కుసూటిగా చెప్పాలంటే ఈ విషయంలో సామాజిక విధాన ప్రధాన యంత్రాంగం అవుతున్నది పంపిణీ యంత్రాంగమే.**

కాని, నూతన సామాజిక విధాన పరిధిలో పంపిణీ చేసేది యేమిటి? పంపిణీ పద్ధతుల ద్వారా తదనుగుణంగా రూపొందించే సమాజపు సాంఘిక నిర్మాణ మౌలిక విభాగాలు యేమిటి?

అవి ఐదు అనీ శాస్త్రవేత్తలు చెబుతున్నారు:

మొదటిది: పాదార్థిక విలువల పంపిణీ. సోవియట్ యూనియన్‌లో ధరలూ, రేట్లూ ఆదాయాలూ, వేతనాలూ, జీతాలు, పింఛన్ పథకం, పన్నుల విధింపు, డబ్బుకూ, ఉచితంగానూ లభించే సేవలు-వీటిని మౌలికంగా సంస్కరించవలసిన తక్షణావశ్యకత వుంది. సరఫరా, గిరాకీలను సమతూకంలో వుంచడం, సరకుల పరిమాణం, వైవిధ్యం, నాణ్యతల సత్వరాభివృద్ధికి ఫలదాయకమైన ప్రోత్సాహకాలను సృష్టించడం, వాటిని తగినవన్ని అమ్మకానికి పెట్టడం, సేవలను

సమూలంగా మెరుగుపర్చడం — యిదే సంస్కరణ ప్రధాన లక్ష్యం.

రెండవది: అధికారంలో పాలుపంచుకునే సంస్థల స్థాయిని పెంచడం. స్వయం మేనేజిమెంటును పెంపొందించడం, దేశ సామాజిక, ఆర్థిక జీవితాన్ని గురించి ప్రజలకు పూర్తిగా తెలియజెప్పడం — యిదే అనుసరించాల్సిన ప్రధాన పథం అని శాస్త్రజ్ఞులు నమ్ముతున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే, కేంద్రీకరణను గురించిన స్టాలినిస్టు భావనను తుడిచి పెట్టడం, మార్కెట్ నిబంధనలు, చొరవ, స్వేచ్ఛ, సాహసోపేతమయిన కార్యకలాపాలపై ఆధారపడిన సామాజిక జీవిత రంగాలను వేగంగా విస్తరించడమూను.

మూడవది: సామాజిక చట్రంలోని ముఖ్యమైన అంశం సామాజిక హామీల, హక్కుల పంపిణీ. ఈ హక్కుల గ్యారంటీల వ్యవస్థను యింకా ముందుకు తీసుకుపోవలసి వుందని జాస్లావ్స్కాయా, శపొష్నికవ్‌ల అభిప్రాయం. కేంద్రీకృత నియంత్రణ నుంచి ప్రజాతంత్ర పరిపాలనకు పురోగమించడం ద్వారా యీ పని జరగవలసి వుంది. అదే సమయంలో యీ హక్కుల, హామీల అమలును సార్వత్రిక చట్టాలు క్రమబద్ధం చేయవలసి వుంటుంది.

మరొక అంశం: వృత్తి, ఉద్యోగ హోదాల పంపిణీ; ఒకే విధమయిన ప్రభుత్వ విధానాన్ని అమలు జరపడటం. ఉద్యోగ స్వభావాన్ని, పని పరిస్థితులను మెరుగుపర్చడం, మానవ బలగానికి పునశ్శిక్షణ, వారిని ఆ యా వుద్యోగాలకు కేటాయించడం ఈ విధాన లక్ష్యంగా వుండాలి. "పనినిబట్టి ప్రతి ఫలం" అన్న సోషలిజం సూత్రాన్ని నికరంగా అమలు జరపడం దీనిలో భాగమే.

చివరిది: సామాజిక నిర్మాణంలోని ఆఖరు అంశం సాంస్కృతిక ప్రతిపత్తి అని జాస్లావ్స్కాయా, శపొష్నికవ్‌లు అంటున్నారు.

సోవియట్ యూనియన్‌లో నూతన సార్వత్రిక సామాజిక విధానం కింది ప్రధాన దిశల్లో పెంపొందుతుందని యీ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ప్రపంచ అత్యుత్తమ అనుభవాన్ని దృష్టిలో వుంచుకొని సోషలిజానికి ఆమోదయోగ్యమయిన రూపాలూ, పరిమితులలో సమాజాభివృద్ధికి సంబంధించిన అన్ని రంగాలను యేక కాలంలో మెరుగుపర్చడం; సామాజిక ప్రగతి రంగాలన్నింటిలోనూ, మనిషికీ, సామాజిక సంక్షేమానికీ ప్రప్రథమ ప్రాధాన్యత వుండేలా చూడడం; సంక్షేమాన్ని పెంపొందించడం; ప్రజాస్వామ్యాన్నీ, బాహాటతనూ పెంపొందించడం; స్వయం మేనేజిమెంటునూ, స్వేచ్ఛాయుత చొరవనూ, తెగువతోకూడిన కార్యకలాపాలనూ పూర్తి స్థాయిలో అభివృద్ధిపర్చడం; సామాజిక, ఆర్థిక జీవితంలో బహువిధ రూపాలను విస్తృతంగా అభివృద్ధిపర్చడం; నిరంకుశాధికార నియంత్రణను నిర్మూలించడం, సార్వత్రిక విశ్వజనీన శాసనాల ద్వారా మనిషి ప్రవర్తనను క్రమబద్ధం చేయడం (నిర్దిష్టంగా విషేధించినవి తప్ప ప్రతిదాన్నీ అనుమతించడం జరుగుతుంది) సమస్త సామాజిక సంస్థల, ఆర్గనైజేషన్ల హక్కులు, బాధ్యతలను స్పష్టంగా క్రోడీకరించే దిశలో ముందుకు సాగడం.

# న్యాయం సామూహిక చైతన్యం

జి. బతీగిన్, డి.లిట్., (తత్వశాస్త్రం)
సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడెమీ
పత్రిక 'సామాజిక అధ్యయనాల'
డిప్యూటీ ప్రధాన సంపాదకులు

## వీరులూ, బూటక వీరులూ

సామాజిక రాజకీయ పరిభాషలో 'న్యాయం' అనే పదాన్ని అన్నిటికన్నా తరచుగా వాడతారు. యిది అన్ని కాలాల్లోని గొప్ప సంస్కర్తలకు గాఢంగా మనసున నాటిన భావన. స్పార్టకస్, సెయింట్ ఫ్రాన్సిస్, మహాత్మా గాంధీ, మార్టిన్ లూథర్ కింగ్ యింకా యెందరో చేసిన త్యాగాలు ఎన్నో.

కాని న్యాయం కోసమే చేస్తున్నామనే భావన ఒక్కొక్కప్పుడు మానవాళికి వ్యతిరేకంగా అనేక నేరాలకు దారితీయవచ్చు. "ఒక న్యాయమైన కమ్యూనిస్టు సమాజాన్ని తేవాలన్న ఎర్రఖ్మేర్‌ల ముఠా నాయకుడు పోల్‌పాట్ ఆలోచనే సామూహిక వూచకోతలకు దారి తీసింది. న్యాయానికి పొంత తరహాలలో యిచ్చుకున్న నిర్వచనం యీ విపరీతాలకు దారితీసింది.

## ఉద్దేశం మంచిదే అయినా నరకానికి దారి

ఉద్దేశం మంచిదే అయినా అది నరకానికి దారి తీయడం యెలా జరుగుతుంది. వ్యక్తి అందరి తరఫునా తానే తీర్పు యివ్వడానికి వ్యక్తి పూనుకున్నప్పుడు తెలిసో తెలియకో నిరంకుశాధికారిగా రూపొందుతాడు.

మంచి వుద్దేశాలు దౌర్జన్యంగా మారిన

న్యాయానికి సంబంధించిన నిజమైన మానవతావాద భావానికి గీటురాయి, దాన్ని అమలు జరిపే పద్ధతులను యెంచుకోవడంలో వుంటుంది. మంచి వుద్దేశాలుంటే చాలదు. న్యాయ చట్టాన్ని నిక్కచ్చిగా పాటించడం, భిన్నాభిప్రాయ హక్కుతో సహా అన్ని మానవ హక్కుల పట్ల గౌరవం - వీటి ఆధారంగా నిజమైన రాజకీయ సంస్కృతి, సామాజిక బాధ్యత కూడా అందుకు అవసరం.



సందర్భంతో సహా 'న్యాయం'లో జరిగే మార్పులు, దాని క్రమాలు తెలుసుకోడానికి సామూహిక చైతన్యం తోడ్పడుతుంది. న్యాయానికి సంబంధించిన నిజమైన మానవతావాద భావానికి గీటురాయి, దాన్ని అమలు జరిపే పద్ధతులను యెంచుకోవడంలో వుంటుంది. మంచి ఉద్దేశాలుంటే చాలదు. న్యాయ చట్టాన్ని నిక్కచ్చిగా పాటించడం, భిన్నాభిప్రాయ హక్కుతో సహా అన్ని మానవ హక్కులపట్ల గౌరవం. వీటి ఆధారంగా నిజమైన రాజకీయ సంస్కృతి సామాజిక బాధ్యత కూడా అందుకు అవసరం.

## సామాజిక బాధ్యత

సోషలిస్టు సమాజాన్ని నవీనీకరించాలంటే న్యాయం అనే భావానికి కొత్త సామాజిక అర్థం యివ్వడం అవసరం. స్వాప్నిక సామ్యవాదంతో కలిపి కట్టడం మానుకోవాలి. "పనిబట్టి ప్రతిఫలం" సూత్రాన్ని నిక్కచ్చిగా పాటించాలి.

## దౌర్జన్యం సంతోషాన్ని తెచ్చిపెట్టదు

బలవంతాన ఏది రుద్దినా అది ప్రజలను నిజాయితీపరులుగా చేయదు సంతోషం కలిగించదు, అన్న ప్రజాస్వామ్య ప్రధాన సూత్రం గ్రహించాలంటే అందుకు ఎంతో రాజకీయ అనుభవం అవసరం. మానవాళి మంచి కోసమే మానవాళికి వ్యతిరేకంగా ఘోర దురంతాలకు పాల్పడిన ఘటనలు తెలుసుకు తీరాలి. అయినా విచారమేమంటే మానవాతీత మయిన సర్వవ్యాపిత అధికారంలో అన్నీ చక్కబెట్టవచ్చునని భావించే

వారు వున్నారు. తగినంతగా అధికారాన్ని విస్తరించకపోవడమే లొసుగులకు కారణమని వారి వాదన. "కాగితం మీదైతే అది నున్నని మార్గం కానీ కాళ్ళకు కంటక పథం"

బలవంతాన ఏది రుద్దినా అది
ప్రజలను నిజాయితీపరులుగా
చేయదు సంతోషం కలిగించదు.

అని పూర్వకాలపు రష్యన్ సైనిక గీతంలో ఒక చరణం వుంది. అలా వుంటాయి కొన్ని పొరపాటు చర్యల అమలు ఫలితాలు.

## మూస పోతలు

సామాజిక అభిప్రాయ సేకరణ ప్రశ్నావళిలో ఒక్కొక్కప్పుడు యిలా అడుగుతుంటారు. మీకేది ఎక్కువ ముఖ్యం, వేతనాలా? లేక మీ పనికి గల సామాజిక ప్రాధాన్యతా? తమ పనికిగల సామాజిక ప్రాధాన్యతే మరింత ముఖ్యమని చాలా మంది భావిస్తారు. కాని తక్కువ వేతనాలకూనా పనికిగల వున్నత ప్రాధాన్యతకూ పొంతన కుదుర్తుందా? అని అడిగేవారు ఒక్కరూ లేరు. స్వాప్నిక సమతావాద మూసపోతలు పాదార్థిక ప్రోత్సాహాలను, నైతిక ప్రణామాలను రెండు భిన్నమయిన వరుసల్లో పెడతాయి.

## ప్రకటనాత్మక చైతన్యం

సామాజిక చైతన్యంలో స్వతంత్ర ప్రవత్తిగల కొన్ని మూసపోతలు రూపుదిద్దుకున్నాయి. వాటి పని ప్రకటనలు చేయడం. దాన్ని ప్రకటనాత్మక చైతన్యంగా నేను పిలవదలిచాను. బోధన, ప్రచార ప్రభావం వల్ల అవి ఏర్పడ్డాయి. చిన్నపిల్లలు సైతం పెద్ద పెద్ద ప్రకటనలను వాటికి తగ్గ పరిభాషను అలవర్చుకుంటున్నారని మన తత్వవేత్తలు చెబుతున్నారు. తెలివితేటలు, అణకువ, సత్ప్రవర్తన గలవారిగా కనిపించేందుకు ఏం చేయాలో పిల్లలు నేర్చుకున్నారు.

ఈ ప్రకటనాత్మక చైతన్యం పయోజనులలో పూర్తి రూపంలో వ్యక్తమవుతుంది. రెండువేలమంది పారిశ్రామిక కార్మికులు తమ తమ ఆదాయాల గురించి యిచ్చిన జవాబులను వేతనాలకు సంబంధించిన రిజిస్టర్లతో ఒడెస్సాకు చెందిన సామాజిక శాస్త్రవేత్తలు ఐ. పొపోవ్, వి. మోయిస్‌లు పోల్చి చూశారు. ఆ జవాబులలో "పొరపాట్లు" అనేవి కొన్ని సామాన్య సూత్రాలను వెలుగులోకి తెచ్చాయి. సరాసరి 111 రూబుళ్ళ ఆదాయం పొందుతున్న కార్మికులందరూ తమ ఆదాయం అంతకన్నా ఎక్కువ అని జవాబివ్వగా, దాదాపు 225 రూబుళ్ళు పొందుతున్న వారంతా తమ ఆదాయాలు అంతకన్నా తక్కువన్నట్టు జవాబు లిచ్చారు. కార్యనిర్వాహకోద్యోగులు ఇంజనీర్లు సైతం తమ ఆదాయాలు తక్కువ చేసి చెప్పే అవకాశముంది. ఆదాయం ఎక్కువని చెబితే అది డబ్బు దుర్దాహానికి చిహ్నంగా చూస్తారనే మూసపోత భావనా, పేదరికమైతేనే మంచిదనే భావనా అందులో వుంది. అదే సమయంలో తక్కువ ఆదాయాల వారు తాము పదిమంది ముందూ చులకనై పోతామనే అభిప్రాయంతో ఎక్కువ ఆదాయాలు చెప్పుకుని ప్రతిష్ఠ పెంచుకోవాలన్న ప్రయత్నం చేశారు.

ఇలాటి స్వాప్నిక సమతావాదం నుంచి

బయటపడడం అనేది నైతికంగా తప్పు కాదు అన్న నమ్మకం కలగాలంటే అలాటి మార్పుకు అధికారయుతమైన ముద్ర పడాలి

## ఆచరణలో స్వాప్నిక సమతావాదం

ఈ "స్వాప్నిక సమతావాద న్యాయ" భావన సామూహిక చైతన్యానికి మాత్రమే పరిమితమై వుంటే అంత తీవ్రమయిన సమస్యగా ఏర్పడదు. కాని అది ఆచరణలో కూడా ఉంది. ఒకే విధమైన పరిశ్రమల్లో వేతనాల్లోని వ్యత్యాసం తగ్గుతూ వచ్చింది. అదే సమయంలో ఆర్థిక మేనేజిమెంటులోని పరిపాలనాపరమైన, ఆదేశాత్మకమైన పద్ధతులవల్ల భిన్నపరిశ్రమలోని వేతనాలలో గణనీయమయిన వ్యత్యాసాలు ఏర్పడ్డాయి. ఉదాహరణకు: పరిశ్రమలలోని వేతనాలతో పోలిస్తే వాణిజ్యం, సేవలు, పౌర ఆరోగ్యంలో వేతనాలు 1950 లో లాగే 2/3 వ వంతు, సంస్కృతీ రంగంలోని వేతనాలు 1½ రెట్లు వున్నాయి. వుద్యోగాలలో వున్న వారికి, పెన్షనర్లకు మధ్య వేతనాలలో తీవ్ర వ్యత్యాసా లున్నాయి. వేతన విధానంలోని లోపాలు, చేసినపనికి ఆదాయాలకు మధ్య వ్యత్యాసం, ద్రవ్యోల్బణక్రమాలు, సరకులు సేవలలో కొరతలు — వీటన్నిటివల్ల నల్ల బజారు ఏర్పడడానికి, ప్రజలలో కొన్ని బృందాల అనార్జితాదాయాలు పెరగడానికి వీలేర్పడింది.

స్వాప్నిక సమతావాద మూసపోతలు మనలో జీర్ణమైపోవడమే కాక మన ఆచరణ లోకి కూడా వచ్చినట్లు సామాజిక సర్వేలు ధృవీకరించాయి. 1978 లో తగన్‌రోక్‌లో సేకరించిన సమాచారం ప్రకారం, కార్య నిర్వాహకోద్యోగుల, డిప్లొమో గల ప్రవీణుల, నిపుణుల, కార్మికుల నెలసరి తలసరి సగటు ఆదాయం 107 రూబుళ్ళని తేలింది. ఇది ఇంజనీర్లకన్నా ఒక్క రూబుల్ ఎక్కువ. నిపుణత తక్కువగా వుండే కార్మికులకన్నా అయిదు రూబుళ్ళు ఎక్కువ. గ్రామీణ ప్రాంతాలలో వ్యక్తుల జీవన ప్రమాణాలు చూసినట్లయితే తమకు కావాల్సింది కొనుగోలు చేయగలవారు కార్మికులలో 7.8 శాతం, సమిష్టి రైతులలో 12.5 శాతం, నిపుణేతరులలో 9.5 శాతం, ప్రవీణులలో 8.7 శాతం మాత్రమే వున్నట్లు తేలింది.

తక్కువ ఆదాయ శ్రేణుల వారి జీవనాన్ని మెరుగుపర్చే వేతనాలు యివ్వాలన్న మంచి ఉద్దేశంతోనే కావచ్చు స్వాప్నిక సమతావాద న్యాయాన్ని సాధించాలన్న ప్రయత్నంవల్ల బాగా నిపుణులైన కార్మికుల, ప్రవీణుల వేతనాలు స్తంభించిపోయాయి. సమర్థవంతమయిన పనికి ప్రోత్సాహాలు సున్నా అయిపోయాయి. శ్రమ ఉత్పాదకత పడిపోయింది. సామాజికంగా విరూపతలు బయటపడ నారంభించాయి. మేధావుల సామాజిక హోదా బాగా దెబ్బతింది. మేధాశ్రమ, ఉన్నతవిద్య ముఖ్యంగా ఇంజనీర్లు ప్రావీణ్యతను పెంచుకొనే కృషి తగ్గుముఖం పట్టింది. పెద్దగా పని చేయాల్సిన అవసరం లేకుండానే జీవనాన్ని కొనసాగించగలమన్న గట్టి నమ్మకం కొందరికి ఏర్పడగా పరాన్న భుక్కు మనస్తత్వ పై ఖరులకు సామూహిక

సమానమైన పని ఫలితాలకు సమానమైన ప్రతిఫలం అన్నది సోషలిస్టు సమానత్వంలో యితర విషయాలతోబాటు గర్భితం.

వర్గ, జాతీయ ఇతర స్థానిక ప్రయోజనాలకన్నా సార్వజనిక మానవ విలువలకు తిరుగులేని విధంగా ప్రాధమ్యత నివ్వడం, పార్టీ నూతన రాజకీయ ఆలోచనా విధాన భావనకు ఆలంబనగా వుంది. అదే సమయంలో మానవుల మధ్య సంబంధాలకు అహింసా సిద్ధాంతం ఒక నియమంగా, సూత్రంగా వుండాలని యీ భావన కోరుతోంది.

చైతన్యం అలవాటు పడేలా యీ స్వాప్నిక సమతావాద న్యాయభావన చేసింది.

## వ్యక్తి బాధ్యతకు ప్రాధమ్యత

వేతనాల చదును అనేదానికి సమానత్వానికి సంబంధమే లేదు. సమానమైన పని ఫలితాలకు సమానమైన ప్రతిఫలం అన్నది సోషలిస్టు సమానత్వంలో యితర విషయాలతోపాటు గర్భితం. సమానంగా పనిచేయకుండా సమానమైన వేతనాలు పొందడం సమానత్వానికి చాలా దూరం. స్వాప్నిక వాద మూసపోతలు పెరెస్త్రోయికా క్రమానికి పెద్ద అడ్డంకి అయ్యాయి. వ్యవసాయ రంగంలో కుటుంబ కాంట్రాక్టులు విస్తరించడానికి, పరిశ్రమలో, నిర్మాణంలో, రవాణాలో స్వయం పెట్టుబడుల బృందాలను ప్రవేశపెట్టడానికి అవి నిరోధకాలు అయ్యాయి.

మానవాంశను దృఢతరం చేయాలంటే వేతనాల వ్యవస్థలో మార్పులు తేవాలి.

స్వాప్నిక సమతావాద న్యాయభావనవల్ల సంస్కరణల అమలుకు ప్రతిఘటన ఏర్పడుతోంది. ఈనాటి సామాజిక ఆర్థిక పరిస్థితి ఎలాటిదంటే సామాజిక ఘర్షణల పరిష్కారానికి ప్రజాస్వామ్య పద్ధతులను యెంచుకోవడంపైనే ప్రగతిశీలమైన న్యాయమైన చర్యలు ఫలప్రదం అవడం అనేది ఆధారపడి వుంది. వర్గ, జాతీయ యితర స్థానిక ప్రయోజనాలకన్నా సార్వజనిక మానవ విలువలకు తిరుగులేని విధంగా ప్రాధమ్యత నివ్వడం పార్టీ నూతన రాజకీయ ఆలోచనా విధాన భావనకు ఆలంబనగా వుంది. అదే సమయంలో మానవుల మధ్య సంబంధాలకు అహింసా సిద్ధాంతం ఒక నియమంగా, సూత్రంగా వుండాలని యీ భావన కోరుతోంది.

బ్యూరాక్రసీని తిప్పి కొట్టాలనే అభిప్రాయం ప్రజల్లో చాలా ప్రాచుర్యం పొందింది. అయితే యీ చర్యను పరిపాలనా యంత్రాంగానికి వ్యతిరేక చర్యగా తరచు పొరబాటు పడుతుంటారు. సామూహిక చైతన్యంలో యిలాటి అభిప్రాయాలు వ్యక్తం అవుతున్నాయంటే విస్తృత ప్రజలలో చట్టపరమయిన సంస్కృతిని పెంచాల్సి వుందని స్పష్టమవుతుంది.

సోవియట్ యూనియన్‌లోని నూతన సామాజిక, భావజాల పరిస్థితి దృష్ట్యా సామాజిక న్యాయ మాత్రాన్ని సమాజ ప్రగతిలో వ్యక్తి పాత్రను ఆధునిక స్థాయికి తేవాల్సి వుంది. పౌర జీవితంలో సమిష్టి రూపాలకు యిప్పటివరకూ ప్రాధాన్యత నివ్వడం జరిగింది. సర్వం సహాధికార సమాజ పౌరునిగా వ్యక్తికిగల బాధ్యతకు ప్రాధాన్యత నివ్వాల్సిన సమయం వచ్చింది.

# పేదరికంలో సమానత్వం నుంచి సంక్షేమంలో సమానత్వానికి

అలెక్సాండర్ వాసిన్‌స్కీ

ఏ విప్లవమైనా తాను విజయవంతమైనాక అశేష ప్రజానీకానికి చక్కని జీవితాన్ని కల్పిస్తానని వాగ్దానం చేస్తుంది. ఏ వుద్యమమైనా ప్రజలకు సంక్షేమాన్నివ్వడమే తన లక్ష్యంగా ప్రకటిస్తుంది. అయితే సంక్షేమానికి అర్థం ఏమిటి, దాన్ని తాము యెలా సాధిస్తాము అనే విషయంలోనే రాజకీయ వ్యవస్థల మధ్య ముఖ్యమయిన తేడాలుంటాయి. చరిత్ర రుజువుపరుస్తున్న దాన్నిబట్టి యిదివరకటి సామాజిక స్వరూపాలన్నీ "పైనున్న 10 000" మందికి మేలైన జీవితాన్ని కల్పించడం, ఆ కొద్ది మందికి ప్రత్యేక హక్కులు సదుపాయాలు లభించేలా యంత్రాంగాన్ని తీక్షణంగా చక్కదిద్దడం నేర్చుకున్నాయి. అయితే 1917 లో రష్యాలో తెచ్చిన అక్టోబరు విప్లవం అత్యధికులకు, సర్వులకూ సంక్షేమాన్ని కల్పించడం లక్ష్యంగా పెట్టుకుని ఒక పెద్ద ముందంజ వేసింది.

చరిత్ర రుజువుపరుస్తున్న దాన్నిబట్టి యిదివరకటి సామాజిక స్వరూపాలన్నీ "పైనున్న 10 000" మందికి మేలైన జీవితాన్ని కల్పించడం ఆ కొద్దిమందికే ప్రత్యేక హక్కులు సదుపాయాలు లభించేలా యంత్రాంగాన్ని తీక్షణంగా చక్కదిద్దడం నేర్చుకున్నాయి. అయితే 1917 లో రష్యాలో తెచ్చిన అక్టోబరు విప్లవం అత్యధికులకు, సర్వులకూ సంక్షేమాన్ని కల్పించడం లక్ష్యంగా పెట్టుకుని ఒక పెద్ద ముందంజ వేసింది.

అయితే విప్లవం విజయం పొందిన తక్షణమే జీవన ప్రమాణాలలో పెద్ద మార్పులు వచ్చేయవు. ఆ దశలో సమానత్వం అనేది పేదరికంలో సమానత్వంగానే వుంటుంది.

ఒక పెద్ద వెల్లువ వచ్చినట్లయితే రాత్రికి రాత్రే సామాజిక వ్యవస్థలో మార్పు తేవచ్చు. అయితే దశాబ్దాల తరబడి పేరుకుంటూ వచ్చిన యీ పరిస్థితిని రాత్రికి రాత్రే మార్చలేము: కార్మికులు, రైతుల దుస్థితి, నిరుద్యోగం, విస్తృతంగా వ్యాపించిన వ్యాధులు, శిశుమరణాలు, ఇళ్ళ కొరత ....

అధికారాన్ని చేపట్టడం ద్వారా బోల్షివిక్కు పార్టీ "రష్యా భయంకర బాధల్ని"

అన్నిటినీ ఒక్కసారి భుజానికెత్తుకుంది.

సమస్యల మంచు చెరియ జారిపడనారంభించింది. పెత్రోగ్రాద్ (ఇప్పుడది లెనిన్‌గ్రాద్)లో ప్రజా సంక్షేమానికి చెందిన పాత ప్రభుత్వ కార్యాలయానికి తండోపతండాలుగా ప్రజలు రానారంభించారు. ఆకలితో అలమటిస్తున్నవారి, యుద్ధంలో వికలాంగులైనవారి, నిరాశ్రయులైనవారి, దిక్కు మొక్కు లేని వారి ప్రతినిధి వర్గాలు వచ్చాయి. కూడూ గూడూ కావాలని కోరాయి. ఆ కార్యాలయానికి నూతన అధిపతిగా నియమితురాలైన అలెక్సాండ్రా కె. లియోంతాయ్ అక్కడికి వెళ్ళి చూడగా సిబ్బంది అంతా కొత్త ప్రభుత్వానికి వెన్నుపోటు పొడుస్తున్నట్టు తేలింది. "రాజ్యాంగ చట్ట సభ అనుమతి లేకుండా" బోల్షివిక్కులు అధికారంలోకి వచ్చారని ఆ కార్యాలయ సిబ్బంది తిరస్కారంగా వెళ్ళిపోయారు. ఆకలి రోగాలతో అలమటించే ప్రజలు మాత్రం ఆమె చుట్టూ నిల్చివున్నారు.

అయినప్పటికీ కొత్త ప్రజా కమిస్సారియేట్‌లోని సామాజిక భద్రతా శాఖ శక్తి మేరకు కొద్దికొద్దిగా సహాయం ప్రారంభించింది. అనాథ శరణాలయాల, మాతా-శిశు సంరక్షణ నిర్వాహణపై కేంద్రీకరించింది.

ఇళ్ళ సమస్య ప్రత్యేకించి తీవ్రంగా వుంది. బాగా శ్రీమంతులైన వారి విశాల రాజప్రాసాదాలు, భవనాలలో కొంత భాగం తీసుకుని కార్మికుల కుటుంబాలకు వాటిని కేటాయించడంతో ప్రభుత్వం కృషి నారంభించింది 1917 నవంబరు డిసెంబరులో మాస్కోలోని 216 గృహాలను నగర సోవియట్ ప్రజావసరాల కోసం స్వీకరించి 20 వేల మంది కార్మికుల కుటుంబాలకు వాటిని కేటాయించింది 1918 లో 4 వేల గృహాలను స్వీకరించింది. పెత్రోగ్రాద్‌లోనూ యీ కృషి సాగింది.

విప్లవమంటే విప్లవమే: సామాజిక సమానతా సూత్రం అనేది ఆస్తుల స్వాధీనంలో మొదట వ్యక్తమైంది

ప్రముఖ శాస్త్రజ్ఞులను, సాంస్కృతిక రంగ ప్రముఖులను మాత్రం దీని నుంచి మినహాయించడం జరిగింది. అయినా తమ పట్ల అన్యాయంగా వ్యవహరించడం జరిగిందని వైద్యులు, నటులు, న్యాయవాదులు, కళాకారులు ఎందరో చేసిన ఫిర్యాదులు పురాతన పత్రాలలో కనిపించాయి. అది వాస్తవమే కావచ్చు. కోట్లాది మంది పాల్గొంటున్న విప్లవ సమయంలో మనోభావాలు ఉద్విగ్నమవుతాయి. సమంజసమైన అవసరమైన వాటితోబాటు నాటకీయ ఘటనలు, విషాద ఘటనలు కూడా జరిగాయి. వనరులు తక్కువగా వున్నందువల్ల కొన్ని స్వాధీనాలు జరిగాయి. అయితే దీనివల్ల అన్ని సమస్యలూ తీరిపోలేదు.

ఒక్క మాటలో చెప్పాలంటే ఆస్తుల స్వాధీనం ఒక్కదానితోనే సామాజిక న్యాయాన్ని 'ప్రవేశపెట్టడం' జరిగిపోదు. అందరికీ సరకులు, సేవలు అందించాలంటే వాటిని ముందు ఉత్పత్తిచేయాల్సి వుంటుంది. సృష్టించాల్సి వుంటుంది.

అయితే నిర్మాణాత్మక కృషికి దురదృష్టవశాత్తు ఒక పిడుగుపాటు అంతరాయం కలిగింది: మొదట 1918 ఫిబ్రవరిలో జర్మన్ దురాక్రమణ. ఆ తరవాత వేసవిలో విదేశీ ప్రభుత్వాల జోక్యం, అంతర్యుద్ధం. అయినా బ్రెస్ట్ సంధి (1918 మార్చి) అనంతరం తిరిగి సంక్షేమ కృషిపై కేంద్రీకరించగలుగుతామని ఆశించాం. అయితే యీ శాంతి కొద్ది కాలమే వుంది.

యుద్ధం దేశాన్ని వెనక్కు నెట్టింది. సామాజిక కార్యకలాపా లన్నిటినీ దెబ్బతీసింది. అదివరకే ప్రకటించిన అనేక సదు



1918 లో పెత్రోగ్రాడ్‌లో, (ప్రస్తుత లెనిన్‌గ్రాడ్)
ఆకొన్న పిల్లలకు వుచిత భోజనం

పాయాల కల్పనా కృషిని వదులుకోక తప్ప లేదు. యుద్ధం అంటే యుద్ధమే: అవసరాలను అత్యంత కనిష్ఠ స్థాయికి తగ్గించుకోవాల్సి వచ్చింది అయితే దేశం భవిష్యతులో యింకా తీవ్రమైన కఠిన పరీక్షలు యెదుర్కోవల్సి వచ్చింది.

కాటకం నిర్దయగా అసంఖ్యాక ప్రజానీకాన్ని పొట్టన బెట్టుకుంది. రష్యాకు మొత్తం ధాన్యంలో మూడోవంతు సరఫరా చేసే ఉక్రెయిన్ జర్మన్‌ల వశమైంది. మధ్య రాష్ట్రాలు, వోల్గా, దక్షిణ ఉరాల్స్, సైబీరియా నుంచి ఆహారధాన్యాలు రానివ్వకుండా జకోస్లవాక్ సైనికులు, వైట్‌గార్డులు చేశారు. పెత్రోగ్రాడ్‌లో, మాస్కోలో, యితరచోట్లా ఆహార సమస్య తీవ్రతరమై పోయింది.

మాస్కో. పెత్రోగ్రాడ్‌లలో ముక్కుపచ్చలారని శిశువులు మృత్యువాత పడుతున్నారు. ఆహారశాఖ కమిస్సార్ ఎ. డి. త్స్యురూపా తయారు చేసిన డిక్రీపై లెనిన్ సంతకాలు చేశారు. పెత్రోగ్రాద్, మాస్కో యింకా మరో 14 పారిశ్రామిక కేంద్రాలలో ఏ వర్గ కుటుంబానికి చెందినవారన్న దానితో నిమిత్తం లేకుండా 14 సంవత్సరాలలోపు బాలబాలిక లందరికీ ఉచితంగా ఆహారం సరఫరాచేయాలని ఆ డిక్రీలో పేర్కొన్నారు. సామూహిక ఆకలి మరణాలను తప్పించడం కోసం ప్రజా ఆహార కేంద్రాలను ప్రవేశపెట్టడం జరిగింది. 1918 లో మాస్కోలో 4 లక్షలమంది నిరుద్యోగుల కోసం 434 వంట కేంద్రాలు ఏర్పరచడం జరిగింది.

1919 లో దాదాపు 30 లక్షలమంది శిశువులకు వుచిత ఆహారం లభించింది. 1920 ఆరంభంలో యీ సంఖ్య 60 లక్షలమందికి మించింది యుద్ధ పరిస్థితివల్ల భారీ స్థాయిలో

ఎర్రసైన్యం అవసరమైంది. 1918 ఆకు రాలు కాలంనాటికి అది మూడురెట్లయింది. సైనికుల సంఖ్య 15 లక్షలయింది. వారికి ఆహారం సమకూర్చడం ఎలా? పైగా దేశంలో లక్షలాదిమంది పస్తులతో ఆకలి చావులకు గురవుతున్నవారికి ఆహారం ఎలా? ఆహారనిల్వల స్వాధీనం పద్ధతుల గురించి అలాటి పరిస్థితిలో పరిశీలించక తప్పలేదు. ఆహారధాన్యాలు నిల్వచేసిన కులక్కులు లేదా సంపన్న రైతులనుంచి బలవంతంగా వాటిని స్వాధీనపర్చుకోవడం, తమ వద్దగల మిగులు ధాన్యాలను అమ్మవలసిందిగా మధ్యతరగతి రైతులను కోరడం - యిదీ ఆ కార్యక్రమం. ఈ అత్యవసర చర్యలు ఫలితాల నిచ్చాయి. అశేష ప్రజానీకానికి సంబంధించిన యీ భారీ స్థాయి కార్యాచరణలో అసంఖ్యాకమయిన విషాదకర ఘటనలు సంభవించాయి. అయితే యిందుకు ఏదో ఒక పక్షాన్నే నిందించకూడదు. ఆహార సమీకరణలోని నియంతృత్వంవల్ల అనేక అధికార దుర్వినియోగాలు, పొరపాట్లు సంభవించాయి. అది తెలిసి కావచ్చు తెలియక కావచ్చు. ఆహార సేకరణ దళాలు ఒక గ్రామానికి వచ్చి అక్కడ కొద్ది గంటల పాటు మాత్రమే వుండేవి. అంత తక్కువ సమయంలో ఎవరు కులక్కు, ఎవరు మధ్యతరగతి రైతు అన్నది తెలుసుకోవడం సులభమేమీ కాదు. అలా వారి మొగాలమీద ముద్ర వుండవు గదా....

అధికార దుర్వినియోగం జరగకపోలేదు. అయితే తప్పనిసరై ఉద్దేశపూర్వకంగానే కాఠిన్యంతో వ్యవహరించాల్సి వచ్చింది. 1917-1918 నాటి గుణపాఠాలలో ఒకటేమిటంటే దీన్ని గోప్యంగా దాచిపుచ్చడం జరగలేదు: పొరపాట్లుగాని ప్రజలకు నచ్చని నిర్ణయాలుగాని లేదా విషాదకర ఘటనలు గాని వేటినీ దాచిపుచ్చలేదు. అప్పుడు దానిని గ్లాసనోస్త్ (బాహటత) అని పిలవలేదు. కేవలం సత్యంఅనే పిలిచేవారు. విప్లవ నాయకులు స్వయంగా తమ విషయంలో సైతం అత్యంత కఠినంగా వ్యవహరించేవారు. ఆహార విషయాల ప్రజా కమిస్సార్ ఎ. త్స్యురుపా దాచకుండా యిలాపేర్కొన్నారు: రజ్‌వోర్‌స్త్కా(ఆహార ధాన్యాల సేకరణ)ను ఒక సైనిక ఉత్తర్వుతో సమానం చేయడం జరిగింది....రైతుల దగ్గర గల నిల్వల నుంచి మేం భారీ ఎత్తున స్వాధీనపర్చుకున్నాం.

ఒక వర్గం, ఒక దేశం భౌతికంగా మనుగడ సాగించడం అనేదే కార్యక్రమంలో ప్రథమాంశంగా వున్నపుడు అలాటి సమయంలో సౌభాగ్యం గురించి ఎవరైనా ఏం మాట్లాడ గలుగుతారు? నిజం. దాదాపు 80 లక్షల మంది ఆకలికి, రోగాలకు ఆహుతి అయ్యారు.

అంతర్యుద్ధం ముగిసేసరికి కార్మికుల సంఖ్య మొదటి ప్రపంచయుద్ధం ముందు కాలంతో పోలిస్తే సగానికి సగమైపోయింది. అంతర్యుద్ధ ప్రత్యక్ష ఘర్షణలో 60,000 మంది నిపుణ కార్మికులు ఆత్మార్పణ చేశారు.

అంతర్యుద్ధం ముగిసింది - తరవాత మూడేళ్ళ యుద్ధానంతరం దేశం కంటినిండా నిద్ర పోగలిగిందా? లేదు. ఆర్థిక బహిష్కరణవల్ల వూపిరి పీల్చుకోడానికి కూడా వీలు చిక్కలేదు. (పెద్ద పరిశ్రమల ఉత్పత్తి 1913 ప్రథమ ప్రపంచ యుద్ధ పూర్వస్థాయితో పోల్చిచూస్తే అందులో ఏడవ వంతు మాత్రమే వుంది). ఆ భారాన్నంతనీ భరించాల్సి వచ్చింది. అయినా ప్రజల స్థితి కొద్ది కొద్దిగా మెరుగు కాజొచ్చింది. మెరుగైన జీవితం లభిస్తుందన్న ఆశలు తిరిగి చిగిర్చాయి....

యుద్ధ కమ్యూనిజం పద్ధతులు, ఒక తుఫానులాగా ఒక్క దెబ్బలోనే ప్రతిదానినీ పరిష్కరించ జూచే అలవాట్లు నిర్బంధంగా బాధ్యతను రుద్దే పద్ధతులు - ఇవి అంత త్వరగా వదలిపోలేదు. అంతర్యుద్ధం ముగిసిన వెనువెంటనే అవి ప్రత్యేకించి బలంగా తిరిగి తలయెత్తాయి; శాంతికాల సరళిలోకి ఆర్థిక జీవితం అప్పటికే మారుతున్నప్పటికీ యిది జరిగింది.

అయితే ఆ సమయంలో ఎన్.ఇ.పి.ని (నూతన ఆర్థిక విధానం) ఆరంభించడం జరిగింది. ఆర్థిక వ్యవస్థకు అది మంచి వూత మిచ్చింది. ఈ కాలంలో సంక్షేమ కృషి పెరగనారంభించింది. సగటు వేతనం మూడు రెట్లయింది. సరకులు, సేవలు పరిమాణంలో నాణ్యతలో పెరిగాయి.

ఆ తరువాత సోషలిస్టు నిర్మాణం సాగుతున్న కొద్దీ ప్రజల సంక్షేమం గణనీయంగా మెరుగు కాజొచ్చింది. మనం ఎన్నో పెద్ద విజయాలు సాధించాం: వారానికి అయిదు రోజుల పని, విశ్రాంతి కేంద్రాలు, ఆరోగ్య కేంద్రాల శాఖోపశాఖలు, వేతనంపై సెలవు, అనారోగ్య సమయంలో సదుపాయాలు, మాతా-శిశు సంరక్షణా కార్యక్రమాలు — యివన్నీ సామాజికంగా సాధించిన పెద్ద ఫలితాలే. అయితే మన సామాజిక భద్రతా కార్యక్రమం ప్రపంచ మొత్తంమీద అత్యంత పరిపూర్ణమైనదని మనం చాలాకాలం క్రితమే చెప్పనారంభించాం. పరిపూర్ణమైనదాన్ని మరింత పరిపూర్ణ మొనర్చడం అవసరం లేదని చెప్పడం సరికాదు. ఉదాహరణకు అనాధుల స్థితిగతులు, అంగవికలుల సమస్యలు....

ఇళ్ళ కొరత సమస్యను క్రమేపీ పరిష్కరించడంలో మన విజయాలను సగర్వంగా చెప్పగలం. మొత్తం 5000 మిలియన్ల చదరపు మీటర్ల విస్తీర్ణం గల ఇళ్ళను నిర్మించాం, ఇంటిని కలిగి వుండే హక్కును రాజ్యాంగ పరంగా కల్పించాం; ఏటా 10 మిలియన్ల మందికి మరింత మెరుగైన గృహ సదుపాయాలు కల్పిస్తున్నాం; 2000 వ సంవత్సరం నాటికి దేశంలో ప్రతి కుటుంబానికీ విడి యింటినో, వాటానో సమకూర్చాలని లక్ష్యంగా పెట్టుకున్నాం. అయితే గృహ నిర్మాణాల వేగం మనకు యింకా సంతృప్తికరంగా లేదు. ఇంకా మెరుగైన సౌకర్యాలు కల్పించాలని కోరుతున్నాం. ఆ పరిశ్రమను విమర్శిస్తున్నాం.

అసంతృప్తి, నిరసన - యివి ప్రతికూలమైన మనోభావాలని భావించడం అలవాటు. అయితే అవి జరిగిన పొరపాట్లు, లోపాలకు మాత్రమే సూచికలు కాక సాధించిన వున్నత స్థాయి అభివృద్ధిదృష్ట్యా గతకాలపు సదుపాయాలు, నాణ్యతా ప్రమాణాలను యీ రోజు ప్రజలు ఆమోదించబోరని స్పష్టంచేసే సూచికలు కూడా.

అయితే పల్లపు ప్రాంతాలను చూడాలంటే ఎత్తయిన ప్రదేశాలకు ఎక్కి చూడడం కనీసం మానసికంగానైనా అవసరం. అందుచేత, మనం సాధించిన విజయాలను 1917 నాటి పరిస్థితిలో కాక భవిష్యత్తుతో, మనకున్న శక్తి సామర్థ్యాలతో, అత్యంత అభివృద్ధి చెందిన దేశాలు సాధించిన స్థాయితో పోల్చి చూడడం మరింత నిర్మాణాత్మకంగా వుంటుంది; యిది కూడా 1917 విప్లవ సంవత్సర గుణపాఠమే. పార్టీ 27 వ మహాసభ రూపొందించిన దీర్ఘకాలిక కార్యక్రమాన్ని మనం అమలుపర్చాల్సి వుంది. పౌర జీవితంలోని సకల అంశాలకూ వ్యాపించిన బలమైన సమగ్రమైన సామాజిక విధానాన్ని అమలుపర్చాల్సి వుంది. □

## సోస చర్చావేదిక



# ఆకలి బాధ

## ప్రపంచస్థాయి విషాదగాథ

ప్రతినిముషమూ ప్రపంచంలో 24 మంది ఆకలి బాధతో మరణిస్తున్నారు. యిది ప్రపంచ స్థాయి విషాదగాథ. యీ తీవ్ర సమస్య పరిష్కారానికి దేశాలు తీసుకోగల సంయుక్త చర్యలున్నాయా? యీ రోదసి యుగంలో కూడా ఆకలి బాధ సమస్య పరిష్కారం కాకపోవడం మానవాళికే సిగ్గుచేటు. సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ కరెస్పాండింగ్ సభ్యుడూ, ఆ సంస్థలోని ఆఫ్రికన్ ఇన్‌స్టిట్యూట్ డైరెక్టరూ అయిన అనతోలి గ్రోమికోకూ ఆకలిబాధ సమస్య పరిష్కారానికై కృషిచేస్తున్న అమెరికాసంస్థ కార్యకర్తలు అయిన స్టార్, లీవీలకూ మధ్య జరిగిన రౌండ్ టేబుల్ చర్చల సారాంశాన్ని సోవెత్‌స్కాయా రోస్సియా సమర్పిస్తోంది. స్టార్ వ్యాపారస్తుడు; లీవీ వైద్య పరిశోధకుడు. ఈ అంశంపై మా పాఠకులకు ప్రముఖ భారతీయ ఆర్థికవేత్త, న్యూఢిల్లీలోని సెంటర్ ఫర్ పాలిసీ ప్లానింగ్ విజిటింగ్ ప్రొఫెసర్ అయిన డాక్టర్ బి.ఎం. భాటియా అభిప్రాయాలను, వ్యాఖ్యలను తెలియజేయడానికి సంతసిస్తున్నాం.

గ్రోమికో : ఆకలిబాధ సమస్య తీవ్రమైనదేగాక ప్రపంచ వ్యాప్త ఘోరవిపత్కర సమస్య. బిలియన్ మందికిపైగా ప్రజలు అంటే ప్రపంచజనాభాలో ఐదవవంతు ఆకలితో అలమటిస్తున్నారు. యేటా 13-18 మిలియన్‌లమంది, అంటే ప్రతి నిముషానికి 18 మంది పిల్లలతో సహా 24 మంది తిండిలేక మరణిస్తున్నారు. మానవుల, ముఖ్యంగా పిల్లల ప్రాణాలు సున్నితమైనవి. ఆహారకొరత అతి గడ్డుగా వున్న సంవత్సరాల్లో 15 మిలియన్లమంది పిల్లలు ఆకలి బాధతో మరణిస్తున్నారు.

స్టార్: హిరోషిమాపై వేసిన బాంబులాంటి దాన్ని భూమండలంపై ప్రతి మూడు రోజులకూ ఒకటిచొప్పున వేస్తే యెంతమంది మరణిస్తారో అంతమంది నేడు ఆకలివల్ల మరణిస్తున్నారు. చిరకాలంగా వున్న యింత తీవ్రమైన ఆకలిబాధ సమస్యపట్ల నిమ్మకు నీరెత్తినట్టు వుండటం సిగ్గు చేటు. అపార సైనిక వ్యయం, అనేకదేశాల్లో సామాజిక అవసరాలకు బహుకొద్ది నిధులను కేటాయించడం, జనాభా పెరుగుదల, ఆర్థిక వెనుకబాటుతనం, జీవ్యావరణ సమస్యలు, అనేక యితర అంశాలు ఆకలిబాధను తెచ్చిపెట్టాయి. నేటి ఆహార నిల్వలు ప్రపంచ జనాభాకు 1.5 రెట్లమందికి సరిపోతాయి.

ప్రశ్న: ఈ పరిస్థితినుంచీ బయటపడే మార్గమేమిటి?

గ్రోమికో: ప్రపంచానికి ఆకలిబాధ సమస్య లేకుండా చేయడం సాధ్యమే. అయితే వాస్తవంలో వున్న సమస్యలను దేశాలు సంయుక్తంగానే పరిష్క

**బిలియన్ మందికిపైగా ప్రజలు అంటే ప్రపంచ జనాభాలో ఐదవవంతు ఆకలితో అలమటిస్తున్నారు. యేటా 13-18 మిలియన్ల మంది, అంటే ప్రతినిముషానికి 18 మంది పిల్లలతో సహా 24 మంది తిండిలేక మరణిస్తున్నారు.**

రించుకొని తీరాలి. సైనిక, రాజకీయ తలపాటును నిర్మూలించి, సోవియట్ యూనియన్ అమెరికాల తోసహా అన్నిదేశాలమధ్య బహుముఖ సహకారాన్ని నెలకొల్పడానికి రాజకీయవేత్తలూ, వ్యాపారస్తులు శాయశక్తులాకృషిసల్పవలసి వుంది. **సమూల నిరాయుధీకరణకు కృతనిశ్చయంతో కృషి సల్పనిదే ఆకలిబాధలేని ప్రపంచాన్ని సృష్టించలేము.** సైనిక సమ్ముఖీనత, స్థానిక ఘర్షణలు కొనసాగినంత కాలమూ పేదదేశాలు ఆకలిబాధ సమస్యను పరిష్కరించుకోలేవు; తమ బడుగుతనాన్ని నిర్మూలించుకోలేవు. సైనిక సమ్ముఖీనత, ఘర్షణలు యింకా డజన్లకొద్దీ మిలియన్లమంది ఆకలి చావులకు మాత్రమే దారితీస్తాయి.

స్టార్: ఆకలిబాధను నిర్మూలించడానికి మనకు రాజకీయ సంకల్పం లోపించింది. రెండవ ప్రపంచ యుద్ధంలో నాజీలను ఓడించగలిగాము. అప్పుడు సోవియట్ యూనియన్, అమెరికాలు మిత్రదేశాలు. ఈ సమస్య పరిష్కారానికి అద్వితీయ అవకాశం నేడు వుందని ప్రజలకు తెలును. యీ సమస్యను పరిష్కరించడానికి సోవియట్ - అమెరికాలు ఒప్పందం కుదుర్చుకోవచ్చునన్న విషయాన్ని ప్రజల దష్టికి మేమూ, యితర అమెరికన్లూ తీసుకు రానున్నాము.

ప్రశ్న: ఆకలిని నిర్మూలించడానికి సోవియట్, అమెరికా ప్రభుత్వాలు ఏమిచేయగలవో మరింత వివరంగా చెప్పగలరా?

స్టార్: మధ్యలో ఒక పెద్దటేబుల్ వున్న జేనీవా సమావేశం హాలును వూహించుకోండి. టేబుల్‌కు యిరువైపులా సోవియట్ అమెరికా నాయకులు కూచుని వుంటారు. యీ శతాబ్దాంతంలోగా ఆకలి బాధను నిర్మూలించేందుకు ఒక సంయుక్త పథకాన్ని అమలు జరపుతామని పత్రికాగోష్ఠిలో చెప్పినట్లు వూహించుకోండి. ఒక అర్థ సంవత్సరం తర్వాత మరొక పత్రికా గోష్ఠి మరొకచోట జరిగినట్లూ, అక్కడ అమెరికా సోవియట్ నాయకులతో ఆఫ్రికా రాజ్యవ్యవహర్తలూ కూడ పాల్గొన్నట్లూ వూహించుకోండి. అభివృద్ధి ప్రాజెక్టుల సాయంతో ఒక ఆఫ్రికాదేశంలో ఐదేళ్లలోగా ఆకలిబాధ సమస్య నిర్మూలనకు పని ప్రారంభించినట్లు వారు ప్రకటిస్తారు. అలా అయితే యెంత బాగుంటుంది? మనం ఆచరణకు పూనుకోవడానికి తరుణమాసన్నమైంది. దీనికి అనుకూలమైన రాజకీయ వాతావరణం మనకు అవసరం.

ప్రశ్న: ప్రభుత్వస్థాయిలో ఒప్పందాన్ని కుదుర్చుకోవడం ఆచరణలో సాధ్యమా?

స్టార్: సాధ్యమని అనుకుంటున్నాను. ఆహార ప్రాజెక్టు చట్రం పరిధిలో నిరాయుధీకరణ సమస్యలను పరిష్కరించడం మరింత సులభం.

గ్రోమికో: **ఒప్పందం సాధ్యమవుతుంది అంతేకాదు యిది అత్యవసరమైనది కూడా. దీనికి ప్రత్యామ్నాయంలేదు. ఆకలిమంటలు తృతీయ ప్రపంచాన్ని యింకెంతమాత్రమూ చుట్టుముట్ట కూడదు. ఆకలిబాధ నిర్మూలనకు సమస్త ప్రభుత్వాలూ కలిసి కృషిసల్పాలి.**

ప్రశ్న: మొట్టమొదట యేదేశానికి సాయం లభించాలన్న సమస్య వచ్చినప్పుడు భావజాల విభేదాలు మళ్లీ తలెత్తుతాయికదా?

స్టార్: తలెత్తగలవు. అయితే, వాటిని పరిష్కరించాలి.

లీవీ: మశూచి నిర్మూలనోద్యమాన్నే తీసుకోండి, దీనికి వాక్సిన్‌ను 18వ శతాబ్దంలోనే కనుగొన్నప్పటికీ దీనికి సంబంధించిన ప్రపంచ ఆరోగ్యసంస్థ ఉద్యమంలో అమెరికా, సోవియట్ యూనియన్, తదితర దేశాలు పాల్గొన్నది 1960 మధ్య కాలంలోనే. యీ వ్యాధిని నిర్మూలించడానికి మనకు ఒక దశాబ్దకాలం పట్టింది. యే ప్రపంచస్థాయి సమస్యనైనా పరిష్కరించడానికి ప్రభుత్వాలు, దేశాలు అంగీకరిస్తే, అవి తప్పకుండా పరిష్కారమార్గాలను కనుగొనగలవు. రాజకీయ సంకల్పంవుంటే పరిష్కారం సాధ్యమే.

ప్రశ్న: ఈ సమస్య పరిష్కారానికి విజ్ఞానశాస్త్రం యేవిధంగా సహాయపడగలదు?

లీవీ: ఆకలిబాధను యెదుర్కొనడానికి మనం శాస్త్రరంగంలో సోవియట్ - అమెరికా సహకారాన్ని యితోధికంగా పెంచాలి. అలా చేయడానికి నూతన మార్గాలను అన్వేషించాలి.

గ్రోమికో: పనిని మరింత వున్నతమైన, అధునాతనమైన స్థాయికి పెంచాలి. యిది సోవియట్, అమెరికన్ పండితులూ, యితరదేశాల్లోని, తృతీయ ప్రపంచదేశాల్లోని పండితులు చేయవలసినపని. అంతర్జాతీయ పరిశోధకులు కలిసి రాజకీయ నాయకులకు ఫలప్రదమైన, శాస్త్రీయమైన సూచనలు చేయాలి.

# డాక్టర్ భాటియా అభిప్రాయాలు

ప్ర: ప్రపంచంలో ఆకలిబాధ విస్తృతి, అందుకు మూలకారణాల గురించి మీ అభిప్రాయం?

జ: ప్రపంచంలో యిప్పుడు సుమారు500మిలియన్ల మంది తీవ్ర ఆహారకొరతను అనుభవిస్తున్నారు. వీరి సంఖ్య ఒక బిలియన్ వుంటుందని కొన్ని యితర అంచనాలు తెలియజేస్తున్నాయి. వీరి సంఖ్య 1974 – 75లో 435 మిలియన్లు వుందనీ, పరిస్థితి యిలాగే కొనసాగితే 2000వ సంవత్సరం నాటికి 540 మిలియన్లకు పెరుగుతుందనీ 1981లో ఎఫ్.ఎ.ఒ. ప్రచురించిన పుస్తకం తెలియజేస్తోంది.

ఆకలిబాధకు కారణం ఆహారోత్పత్తి తగినంతగా లేకపోవడమేనని 1973లో జరిగిన ప్రపంచ ఆహార సమావేశం అభిప్రాయపడింది. కానీ యిప్పుడు ఆహారధాన్యాల లభ్యత అనేది సమస్యకానేకాదు. జనాభా పెరిగినప్పటికీ తగినంత ఆహారాన్ని సప్లయి చేసేస్థితిలో ప్రపంచ వ్యవసాయ వ్యవస్థ వుంది. పేదరికం, గతంలో వలసపాలనలో వున్న దేశాల ఆర్థిక వ్యవస్థలు అభివృద్ధిచెందకపోవడం యీ ఆకలిబాధకు ప్రధాన కారణం. ఆర్థికాభివృద్ధి కోసం జరుగుతున్న ప్రపంచ పరుగు పందెంలో యీ దేశాలు గత 200యేళ్లుగా వెనుకబడి వున్నాయి. అంతర్జాతీయ సామ్రాజ్యవాదులు తమకు అనుకూలమైన ప్రపంచ వ్యాపార నమూనాను రుద్దారు. అంతర్జాతీయ ఆర్థిక సంబంధాలు అసమంగా వున్నాయి. పేదదేశాలు తమ సరకులకు మార్కెట్లు, పెట్టుబడి, పరిశ్రమల స్థాపన, వ్యవసాయాభివృద్ధి, అధునాతన యంత్రాలు—వీటన్నిటికీ అభివృద్ధిచెందిన దేశాలపై ఆధారపడి వున్నాయి. అందువల్ల అవి తగినంత ఆహారాన్ని వుత్పత్తిచేసుకోడానికీ, పెరుగుతున్న జనాభాకు బతుకుదెరువు చూపడానికీ తమ ఆర్థిక వ్యవస్థలను తగినంత వేగంగా అభివృద్ధిచేసుకోలేకపోతున్నాయి. ప్రపంచ వ్యాప్త ఆకలిబాధకు అసలుకారణమిదే. తీవ్ర ఆహారకొరతకు గురౌతున్నది పేదదేశాల్లోని పేదవారే. బొటాబొటిగా పండేపంటలు కూడా చేతికందనపుడు వీరు ఆకలి చావులకు గురయ్యే ప్రమాదముంది.

ప్ర : ఆకలిబాధను పారదోలడానికి ప్రపంచ దేశాలు ముఖ్యంగా సోవియట్ యూనియన్, అమెరికాలు సంయుక్తంగా కృషిచేయవీలుందా?

జ : ఇందుకు పరిష్కారం నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ ఏర్పాటులో వుంది. అభివృద్ధి చెందిన దేశాల సంయుక్తతోడ్పాటుతో అభివృద్ధి చెందుతున్న దేశాలు తమ ఆర్థిక వ్యవస్థలను పటిష్టంచేసుకోడానికి, తమ వుత్పాదనలను, వుత్పత్తులను పెంచుకోడానికి, తమ ఆదాయ స్థాయిలను గణనీయంగా పెంచుకోడానికి యీ నూతన వ్యవస్థ వీలుకల్పిస్తుంది. అన్నిదేశాల కో ఆపరేటివ్ కామన్‌వెల్త్‌ను సృష్టించడమే దీని లక్ష్యం.

అయితే యీ లక్ష్యాన్ని ఒక్క పెట్టుతో సాధించలేము. యీ దిశలో క్రమక్రమంగా సాగాలి. ప్రపంచ ఆకలిబాధ సమస్యపై గ్రోమికో, స్టార్, లీవీల రౌండ్‌టేబుల్ చర్చ సందర్భోచితమైనది. "సైనిక, రాజకీయ తలపోటును నిర్మూలించ

డానికీ, సోవియట్ యూనియన్, అమెరికాలతోసహా అన్ని దేశాలమధ్య బహుముఖ సహకారాన్ని నెలకొల్పుకోడానికీ రాజకీయ నాయకులు, వ్యాపార వర్గాలు చేయగలిగినదంతా చేయాలి'' అనీ, ''సమూల నిరాయుధీకరణకోసం పట్టుదలతో కృషీ చేయనిదే ఆకలిబాధ లేని ప్రపంచాన్ని సృష్టించలేము'' అనీ గ్రోమికో వెల్లడించిన అభిప్రాయాలతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ప్రపంచంనుండి పెదరికాన్ని పారదోలే, ఆకలిబాధను తొలగించే బృహత్తరమైన, అత్యంత వుదాత్తమైన కర్తవ్యాన్ని సన్నిహిత సహకారంతో నెరవేర్చడానికి అమెరికా, సోవియట్ నాయకులు రాజకీయ పట్టుదలను పెంపొందించుకోవాల్సిన అవసరముంది. గాంధీ మహాత్ముడు చెప్పినట్టు ప్రపంచంలో యెవరికి కన్నీటి బాధ లెకుండాచూడాలి.'' అందుకు యీ వుభయదేశాలూ యీ కృషిలో నాయకత్వం వహించేందుకు చేతులు కలపాలి. ప్రపంచ శాంతిని లక్ష్యంగా పెట్టుకోవాలి; కాని అణుయుద్ధాన్ని కాదు. యీ లక్ష్యసాధనకు యీ ఉభయదేశాలూ యితరదేశాలకు ఆదర్శంగా వుండాలి.

ప్ర: విజ్ఞానశాస్త్రం ద్వారానేగాక యీ సమస్యా పరిష్కారానికి యితరత్రా అనుసరించాల్సిన పద్ధతులేమిటి?

జ: విజ్ఞానశాస్త్రం ఆహార కొరతను తీర్చడానికి, జీవన ప్రమాణాలను పెంచుకోడానికి సహాయపడుతుంది. అంతేకాదు, యిందుకు నిరాయుధీకరణ ముఖ్యమైన చర్య ప్రధమ చర్యగా వుండాలి. దీనివల్ల విడుదలయ్యే వనరులతో వర్ధమానదేశాలు తమ ఆర్థిక వ్యవస్థలను అభివృద్ధి చేసుకొనే వీలుంటుంది. అభివృద్ధిచెందిన దేశాల శాస్త్ర, సాంకేతిజ్ఞతలను వర్ధమానదేశాలకు అందుబాటులో వుంచినట్టయితే అవి తమ ఆర్థిక వ్యవస్థలను పెంపొందించుకొనే క్రమాన్ని వేగిరపర్చుకొంటాయి. అలాంటి అదృష్టానికి నోచుకోని తమ తోటి దేశాలపట్ల అభివృద్ధిచెందిన దేశాలు విశాల హృదయాన్ని, వుదార స్వభావాన్ని, దాతృత్వాన్ని కనబర్చాలని సలహా యిచ్చినట్టు యిది కనిపించవచ్చు. కాని అదేమాత్రం కాదు. సంపన్నదేశాల దీర్ఘకాలిక ప్రయోజనాలదృష్ట్యా అవి ఆ పంధానవలంభించడం అవసరం: అవి తమ నిరంతర ఆర్థికాభివృద్ధిని నిలబెట్టుకోవడానికి యిది అవసరం; యీ దేశాలు ఉత్పత్తిచేసిన సరకులకు డిమాండ్ తగ్గడం యిప్పటికే ప్రారంభమైనందున వాటి అభివృద్ధికి పరిమితులేర్పడ్డాయి. కొద్దిరోజుల్లోనే ప్రపంచ మాంద్యం దాపురించేట్టు కనిపిస్తోంది.




"అన్నం కావాలి. అణుయుద్ధం వద్దు" అనే నినాదాలుగల పోస్టర్ (జి డి.ఆర్)

ప్రపంచంలో యీ ఆకలిబాధ సమస్యపై చర్చను భావావేశం స్థాయినుండి శాస్త్రీయ స్థాయికి పెంచాలని, ప్రజాభిప్రాయాన్ని మలచడంలో తోడ్పడగల మేధావుల్లో దీన్ని నిర్వహించాలని గ్రోమికో వెల్లడించిన అభిప్రాయంతో నేను యేకీభవిస్తున్నాను. యుద్ధంనుండి శాంతికి, ఆయుధాలనుండి శాంతియుత ప్రపంచ ఆర్థికాభివృద్ధికి మళ్లడం పెద్ద దేశాల సొంత ప్రయోజనాల దృష్ట్యా యెలా అవసరమో మనసుకు నాటుకునేట్టు చెప్పాలి.

రచయిత యూరి బొందారెవ్ (1924) రెండవ ప్రపంచ యుద్ధ యోధుడు. లెనిన్ బహుమతి, ప్రభుత్వ బహుమతుల విజేత. ఆర్.ఎస్.ఎఫ్.ఎస్.ఆర్ రచయితల యూనియన్ బోర్డు ప్రథమ డిప్యూటీ యు.ఎస్.ఎస్ ఆర్ రచయితల యూనియన్ కార్యదర్శివర్గ సభ్యుడు, పార్లమెంటు సభ్యుడు, యు ఎస్.ఎస్.ఆర్ సుప్రీం సోవియట్ జాతుల సోవియట్ వుపాధ్యక్షుడు. ఆయన సవెత్స్కయా కుల్తూరా విలేకరికిచ్చిన ఇంటర్వ్యూను మీకు అందిస్తున్నాం.



# అనంత విశ్వం పట్ల అందరికీ సమాన బాధ్యత

ప్ర: "మలిన చిత్తులను తేజోమయ పదాలతో పరిశుద్ధపర్చడం" ప్రసంగ కళతో సహా కళలన్నిటి ఆశయం అని ప్రాచీనకాలపు చింతకులు గట్టిగా భావించారు వర్తమాన రంగస్థలానికి కూడా యిదే వర్తిస్తుందా? ఆధునిక సాహిత్యానికి రంగస్థలానికి ఏది ఆశయంగా వుండాలని మీ అభిప్రాయం? ఈనాడు కళలో సాంప్రదాయం పాత్ర ఏమిటని మీ అభిప్రాయం?

జ: రంగస్థలంతోసహా ఆధునికసాహిత్యం ఆశయాలు మార్పులేనివి, శాశ్వతమైనవని నా అభిప్రాయం. అయితే ఈ ఆశయాలకు చరిత్రలోని ప్రతి కొత్త దశలోనూ వాటి విశిష్ట లక్షణాలు వుంటాయి. విశ్వాసం, ఆశావాదం, ఔదార్యం - మానవాళికి చెందిన యీ గొప్ప త్రిసుగుణాలపైనా ఆధునిక ప్రపంచం హానికర పర్యవసానాలు కలిగిస్తున్నదనీ, విజ్ఞానశాస్త్రం, సాంకేతిజ్ఞత....కళ, యింకా యిలాటి వాటికి బలవంతంగా స్థానం కల్పించేట్టు చేస్తున్నదనీ నా అభిప్రాయం. వినిమయ వాదపు క్రూర ఘాతాలు తగులుతున్నా కళ, సాహిత్యం మాత్రం యింకా సొంత పట్లు నిలుపుకున్నాయి.

సాహిత్యం మీద, పుస్తకాలు చదవడం మీద, రంగస్థల ప్రదర్శనలకు వెళ్ళడం మీద అపేక్ష లేనివారిని చూసి జాలిపడాలి. ఎందుకంటే సౌందర్యం, వూహా జగత్తు వారికి లభించకుండా పోతోంది.

ఈ ప్రపంచంలోని మనమంతా సహజంగానే పరస్పరం బాంధవ్యం గలవారిమన్న సత్యాన్ని నిజమైన కళ తప్పనిసరిగా నొక్కి చెబుతుంది: పుట్టుక, బాధ, ఆకలి, మరణం యివన్నీ సాపేక్షమైనవి గావు, సంపూర్ణ సత్యాలు.

చారిత్రక మయిన జ్ఞాపకాలను, వూహా బలాన్ని అవి నేర్పుతాయి, పెంపొందిస్తాయి. ప్రజల మధ్యగల సహేతుక బాంధవ్యాలను అవగాహన పర్చుకొనేట్టు చేస్తాయి. మన కాలానికి యెంతో ముఖ్య విషయమైన సౌందర్య దృష్టిని అవి పెంపొందిస్తాయి. పుస్తకాలు, రంగస్థలం - యివి టెలివిజన్ కన్నా హెచ్చుగా మన కందిస్తాయి. టెలివిజన్ మనల్ని ఆలోచించేందుకు ప్రోత్సహించదు. కనీసం యిప్పటి వరకూ అది అలా చేయలేదు.

సాహిత్యంమీద, పుస్తకాలు చదవడం మీద, రంగస్థల ప్రదర్శనలకు వెళ్ళడంమీద అపేక్ష లే.వారిని చూచి జాలిపడాలి. ఎందుకంటే సౌందర్యం, వూహా జగత్తు వారికి లభించకుండా పోతోంది. నాకు తెలిసినంత వరకూ అమెరికా ప్రజల్లో 68 శాతం మంది, తమ కుటుంబ సభ్యులతోనో, మిత్రులతోనో ప్రకృతిని చూస్తూనో, తమ కార్యకలాపాల లోనో, పుస్తకాలు చదువుతూనో రంగస్థల ప్రదర్శనలు, క్రీడలు చూస్తూనో గడపడం కన్నా టీవీ ముందు కూచోడంలోనే ఎక్కువ ఆనందం పొందుతున్నారు. అంటే తమ చుట్టూ వున్న సహజ జీవితంమీద వారికెలాటి ఆసక్తి లేదన్నమాట.

ఇతరులకు మేలు చేస్తున్నానని భావించే వ్యక్తి చైతన్యంలోంచి సాహిత్యం, రంగస్థలం వుద్భవిస్తాయి. కాబట్టి వాటికి ఆత్మ గౌరవం లక్షణంగా వుంటుంది. ఈ ప్రపంచంలోని మనమంతా సహజంగానే పరస్పరం బాంధవ్యం గలవారిమన్న సత్యాన్ని నిజమైన కళ తప్పనిసరిగా నొక్కి చెబుతుంది: పుట్టుక, బాధ, ఆకలి, మరణం యివన్నీ సాపేక్షమైనవి గావు, సంపూర్ణ సత్యాలు. మనిషి ఏకకాలంలో సుఖదుఃఖాలు చవిచూస్తాడన్న సంపూర్ణ సత్యంలాటిదే యిదీని.

సాంప్రదాయాల కొనసాగింపు తెగిపోయినపుడు, అవి ప్రాముఖ్యతను కోల్పోయినపుడు కళ వికసించదు. నది పుట్టుకచోట ఆనకట్ట కట్టినట్టవుతుంది. అలా కడితే అన్నిచోట్లా తోటలు వెల్లివిరుస్తా యను కోవడం పిచ్చివాడి తలపు. సాంప్రదాయం ఒక ధృవతారగా వుండి దారిచూపాలి. ఉన్మాదపు కలలు, అర్థం పర్థంలేని పదాల పిచ్చి కూర్పు, పదాలతో ఆటలాడడం; ఆధునిక చిత్రాల పేరిట రంగుల్ని అయోమయంగా పూయడం; సంగీతానికి బదులుగా పట్టాలు తప్పిన రైలు పడిపోయిన చప్పుళ్ళు, హింసకు గురౌతున్న జంతువుల ఆర్తనాదాలు వినిపించడం యివన్నీ మానవుణ్ణి భావోద్వేగ ప్రపంచం నుంచి పతన మొనర్చడమే.

గ్రీకు పురాణాలు, విషాద గాధలు, మధ్య యుగాల వీర గాధలు, రష్యన్ చరిత్ర గ్రంధాలు, జానపద కధలు, వివిధ దేశాల వీర గాధలు యివన్నీ మనకు లేకపోతే, పవిత్ర పాత్రల వర్ణచిత్రాలు, జానపద

ప్రపంచ సంస్కృతి అంతా ఒకే గొలుసు సాహిత్యాలన్నీ రక్తసంబంధం గలవి. భిన్న పరిస్థితుల వల్ల జాతీయ లక్షణాలు పొందినవి.

జీవితానికి అర్థం సత్యాన్వేషణలోనే వుంది

పాటల రాగాల వరసలు మనకు తెలియక పోయినట్లయితే ఆధునిక కల్పనా సాహిత్యం గాని చిత్రాలుగాని సంగీతంగాని వుండేవే కాదు. ప్రపంచ సంస్కృతి అంతా ఒకే గొలుసు. సాహిత్యాలన్నీ రక్తసంబంధం గలవి. భిన్న పరిస్థితుల వల్ల జాతీయ లక్షణాలు పొందినవి. రంగస్థలం సాంప్రదాయానికి తిలోదకాలిచ్చినపుడు అది విల్వ పీటిమడుగులా అయిపోతుందని నేను స్పష్టంగా చూశాను.

ప్ర: వర్తమాన ప్రపంచంలో సౌందర్య భావనను మీరెలా వివరిస్తారు.

జ: మనసుకి కలిగే దయపూర్వక ప్రేరణ, ఒక న్యాయమైన కార్యం కోసం, పరిపూర్ణత కోసం, న్యాయం కోసం, విజయితీ కోసం కృషి . యివి మనలో సౌందర్య భావన కలిగిస్తాయి. నైతికంగా బలంగా వున్న ప్రజలకు సాటిలేని సౌందర్య వియమాన్నిచ్చేది ప్రకృతి. కళగాని, నిర్మాణాలుగాని యింకే అద్భుతమైన వస్తువుగాని యివన్నీ ప్రపంచ సౌందర్యాన్ని అనుకరించేందుకు విఫల ప్రయత్నం చేస్తాయి. ప్రకృతి గొప్పతనానికి యీర్ష్యపడి సాంకేతిజ్ఞతతో కలిసి దానిని దోచుకు నాశనం చేయడానికి ప్రయత్నిస్తాయి. తక్షణ లాభాపేక్ష, అత్యాశ, అసహనం వంటి కారణాల వల్ల మనిషి అతి క్రౌర్యంగా ప్రకృతికి అంగవైకల్యం తెచ్చిపెడుతున్నాడు. యిది స్వగృహాన్ని నాశనం చేసుకోవడమే. తన లోపలి మనోభావాన్ని, సంతోషాన్ని, దయని అణచివేసుకోడానికి మనిషి ప్రయత్నించడమంటే ప్రకృతికి విరుద్ధంగా ప్రవర్తించడమే. యిది తనలోని సత్య సౌందర్యాన్ని దాచిపెట్టడమే. సౌందర్యం అనేది ఆనందదాయకం, విషాదకరం, దయాకరం, క్రూరంగా కూడా వుండవచ్చు..

ఎంతమంది సౌందర్యాన్ని అర్థంచేసుకుని అనుభూతి పొందితే మన జీవితం అంత స్వచ్ఛంగా వుంటుంది. పక్కవారిపట్ల ఆప్యాయత ఏర్పడుతుంది. సౌందర్యం మనల్నందరినీ కలుపుతుందని నేను నమ్ముతున్నాను.

ప్ర: మీ పుస్తకాలలో పాత్రలు జీవిత పరమార్థం సత్యాన్వేషణ వంటి వాటిని గురించి పదే పదే చెపుతాయి ఎందుకని?

జ: ప్రపంచానికి ఒక అర్థం ఒక లక్ష్యం కల్పించాలన్నది సర్వదా మానవ జీవిత లక్ష్యంగా వుంటున్నది. అది లేకపోతే జీవితాలు తెగిన గాలిపటాలై పోతాయి. రేపే ఒక ప్రవక్త వుద్భవించి ఆయన నోటంట మనం సత్యాలన్నిటినీ విన్నప్పటికీ మనం అతడిని నమ్మం. ఎందువల్లనంటే జీవితానికి అర్థం సత్యాన్వేషణలోనే వుంది. మోసాల్ని ప్రతిఘటించి నిస్వార్థత, విజ్ఞతలు యింకా ఎంతోకాలంపాటు పోరాడాల్సి వుంటుంది. నిర్లక్ష్యతను వదిలించే ఆశయంతో యిప్పుడు

మూడు పరిమాణాలలో మనిషి తన విలువ చూసుకుంటాడని నా అభిప్రాయం: వీరోచిత కృత్యంలో (అవరోధాలను అధిగమించడంలో) సత్యాన్వేషణలో, పశ్చాత్తాపంలో.

అనంతవిశ్వం విషయంలో మనం అందరికీ సమాన బాధ్యత వుందని మనం భావించాలి. నైతిక నియమం అంటే ప్రజల్లో ఒకరిపట్ల మరొకరికి గల బాధ్యత.

పుస్తకాలు రాస్తున్నారు. నాటకాలు ప్రదర్శిస్తున్నారు. స్వీయ పరిపూర్ణత, నిరాడంబర జీవితం వుండాలని టాల్‌స్టాయ్ తన జీవిత చరమాంకంలో వుద్బోధించారు. ప్రజలు ఒకరిపట్లమరొకరు ఆప్యాయతను పెంచుకోవడంలో జీవితానికి అర్థం వుంటుందని భావించారు. మూడు పరిమాణాలలో మనిషి తన విలువ చూసుకుంటాడని నా అభిప్రాయం: వీరోచిత కృత్యంలో (అవరోధాలను అధిగమించడంలో) సత్యాన్వేషణలో, పశ్చాత్తాపంలో. సత్యం బహుముఖమయినది. దానిలో ఒక చిన్న భాగాన్ని మాత్రమే మనం తెలుసుకుంటాం.

ప్ర: ప్రేమ అంటే ఏమిటి? అనుభూతిని మీరు ఎలా నిర్వచిస్తారు?

జ: టాల్‌స్టాయ్ చెప్పిన మానవుని విశ్వజనీన ప్రేమ: అందరికీ మేలు చెయ్యి అనేది. ప్రకృతి పరమోన్నత నియమం స్త్రీ పురుషుల ప్రేమ - యిది అన్నిటినీ మించిపోయే భావోద్వేగం. అదే సమయంలో అతి సుతారమయినది. వ్యక్తి నిష్టం, మార్మికం ఇది వ్యూహాత్మకమైన సర్వజనీన ప్రేమకన్నా సున్నితమైనది. సజీవమైనది. దీనినే నేను సమర్థిస్తాను. అది ప్రపంచానికీ, దేశానికి మేలు చేస్తుంది. అది దేవలోక చిహ్నం.

ప్ర: పాశ్చాత్య దేశాల మూక సంస్కృతిని గురించి మీ అభిప్రాయం?

జ: పొగడ్తలు, వాగ్దానాలు, అబద్ధాలతో ప్రతి ఒక్కరినీ కొనివేసే, లంచం పెట్టే డబ్బు గుప్పిడి అని నా అభిప్రాయం. సత్యానికి తలుపులు సాధారణంగా దీనికి గట్టిగా మూసివుంటాయి. బూటకపు ఆదర్శ మూర్తులను సృష్టించే కుప్పతెప్పలైన వాణిజ్య సరకుల పరిమాణం వ్యక్తిత్వాన్ని తొక్కివేస్తుంది. ప్రపంచ వినాశతను అమెరికా సరళిలో డబ్బిచ్చి వాయిదా వేయించుకోవడం (హింస, క్రౌర్యం, అశ్లీలం) వంటిది మూక సంస్కృతి.

.... .... ....

ఇ. కాంట్ యిలా అభిప్రాయపడ్డారు: తారామయ ఆకాశం నా శిరస్సుపైన వుంది. నైతిక నియమం నా ఆత్మలో వుంది. అంటే అనంతవిశ్వం విషయంలో మనం దరికీ సమాన బాధ్యత వుందని మనం భావించాలి. నైతిక నియమం అంటే ప్రజల్లో ఒకరిపట్ల మరొకరికి గల బాధ్యత. ఈ నియమమేగనక లేకపోయినట్లయితే కేవలం కరుకుతనం, మురికితనం మినహా యేమీ మిగలదు. అందువల్ల నా పాత్రలన్నిటిపైనా, పూర్వపద్ధతి విమర్శకులు "ప్రతినాయక" పాత్రలుగా పరిగణించే వాటితో సహా అన్నిటిపైనా నాకు సానుభూతి వుంది.

(సంక్షిప్తం)

# ప్లాస్మాలో తరంగాలు




## భౌతిక క్రమాలలోని గొప్ప రహస్యం

రొయాల్డ్ సగద్యేయేవ్, డైరెక్టర్,
రోదసీ పరిశోధనా ఇనిస్టిట్యూట్;
సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ.

సంపూర్ణంగా అయనీకరించిన ప్లాస్మాలోని సంక్లిష్టమైన తరంగాల క్రమాలను గురించి విశదీకరించిన సోవియట్ భౌతికశాస్త్రవేత్తల బృందానికి 1987 సోవియట్ ప్రభుత్వ బహుమతి లభించింది.

ప్లాస్మా భౌతికశాస్త్రం అనేది సాపేక్షంగా కొత్త శాస్త్రం. యిది గత కొద్ది సంవత్సరాలుగా చాలా త్వరితంగా అభివృద్ధి చెందుతోంది. ప్లాస్మా సూత్రాలపట్ల ఆసక్తి సహజమే. యెందుకంటే సూర్యుడు, నక్షత్రాలు, నక్షత్రాలమధ్య ప్రదేశం, గ్రహాల సమీప ప్రదేశం, గ్రహాల మధ్యగల ప్రదేశం — యివన్నీ బ్రహ్మాండమైన ప్లాస్మా వ్యవస్థలే, అంతా ప్లాస్మా సాగరమే. మన భూగోళాన్ని ఆవరించి వున్నది ప్లాస్మాయే. యీ సాగర తుఫానుల ప్రతిధ్వనుల ప్రభావం ప్రాణికోటిపై, మానవ మనుగడపై ప్రత్యక్షంగా పడుతుంది.

అణువుల సంలీనాన్ని నియంత్రించే సమస్యను పరిష్కరించడానికి ప్లాస్మా ధర్మాలను శాసించే నియమాల పరిజ్ఞానం అవసరం. రేడియో ఎలక్ట్రానిక్స్ లేజర్, ప్లాస్మా సాంకేతిజ్ఞత, ఆవేశిత కణాలు, త్వరణకారిణులు, ముమ్మర రేడియో తరంగాలు — వీటిలో సాధించి విజయాలు ప్లాస్మా భౌతికశాస్త్రానికి గట్టి వూపునిచ్చాయి.

విద్యుచ్ఛక్తి ప్రసారాలు సృష్టించే పలురకాల విద్యుదయస్కాంత తరంగాలు ప్లాస్మాలో చాలా సులభంగా వుత్తేజం పొందుతాయి. యిది ప్లాస్మా ప్రత్యేక లక్షణం. అందువల్ల ఒకానొక దశలో ప్లాస్మా పరిస్థితిలో విద్యుదయస్కాంత తరంగాల వేగంతో మార్పు వస్తుంది.

విద్యుదయస్కాంత తరంగాలతో ప్లాస్మాను కొన్నివందల మిలియన్ల డిగ్రీల వరకు వేడిచేయవచ్చు. ప్లాస్మాపై తీవ్రంగా పడే రేడియేషన్ శక్తిని ఆరంభ రేడియేషన్ తరంగాల ఫ్రీక్వెన్సీ కన్నా వందల రెట్లు తక్కువ లేదా యెక్కువ ఫ్రీక్వెన్సీగల తరంగాలుగా మార్చవచ్చు. ప్లాస్మాలోని కాంతి నిరోధక భాగంలోకి ప్రవేశించే సన్నని లేజర్ కిరణం దాన్ని పారదర్శకం చేస్తుంది. కాంతి చొరడానికి అవసరమైనంత వెడల్పు మార్గాన్ని యీ చర్యద్వారా మనం నిర్మించుకోవచ్చు. దీనంతటినీ "సంపూర్ణంగా అయనీకరించిన ప్లాస్మాలో తరంగాల క్రమాల గురించిన రేఖీయేతర గతిశాస్త్ర ప్రాథమిక సూత్రాలు" అనే సిద్ధాంత కృషిద్వారా విశదీకరించినందుకే యీ శాస్త్రజ్ఞులకు 1987 సోవియట్ ప్రభుత్వ బహుమతి లభించింది.

అణువుల సంలీనాన్ని నియంత్రించే సమస్యను పరిష్కరించినట్లయితే అక్షయ శక్తివనరులను సృష్టించుకోవచ్చు. భారీ హైడ్రోజన్ అణువులు సంలీనమైనప్పుడు యీ శక్తి విడుదలౌతుంది. సజాతి విద్యుత్తు కణాలు వికర్షించుకుంటాయి. ఆ వికర్షణాశక్తులను ఎలా లోబర్చుకోవాలనేదే అసలు సమస్య. అందుకు పదార్థాన్ని వేలాది మిలియన్ల డిగ్రీలవరకు వేడిచేయాలి. దీనివల్ల కణాలు సెకనుకు వెయ్యి కిలోమీటర్ల వేగంతో పరస్పరం ఢీకొంటాయి.

చిన్నచిన్న గుళికలను బాగా వేడిచేసినట్లయితే సెకనులో కొన్ని బిలియన్లవంతు సమయంలోనే వాటినుండి ప్లాస్మా అన్ని దిశల్లో చెల్లాచెదరె

పోతుంది. అలా జరగకుండా వుండాలంటే వేడిచేసేందుకు పట్టే సమయాన్ని యింకా తగ్గించాలి. ప్లాస్మాతో శక్తివంతమైన అయస్కాంత తరంగాల సహచర్యద్వారా యీ సమయాన్ని తగ్గించవచ్చునని బహుమతి గ్రహీతలు రుజువుపర్చారు.

ఈకృషి ప్రాతిపదికపై, తీవ్రస్థాయిలో పదార్థాలను వేడిచేయడానికి అభివృద్ధి చేసిన ప్రక్రియ, భారీస్థాయిలో అణువులను సంలీనం చేయగల టొకామాక్ రకం కేంద్రాలకు ప్రయోజనకంగా రుజువైంది. యీ కేంద్రాల్లో ప్లాస్మాను అయస్కాంత క్షేత్రంద్వారా అదుపులో వుంచుకోవచ్చు.

తరంగాలతో కణాల వేగాన్ని పెంచే ప్రక్రియకూడా ఆసక్తికరమైనది. దీనిద్వారా కణాలలో విరివిగా శక్తిని నింపడమేగాక నిర్దేశిత దిశలో పయనించే ఎలక్ట్రాన్, అయాన్ గుచ్ఛాలనుకూడా సృష్టించడం జరిగింది. ప్రాథమిక కణాలను కనుగొని వాటిమధ్య సహచర్యను నిర్వహించడం యిలాంటి అత్యధిక శక్తివంతమైన గుచ్ఛాలద్వారానే సాధ్యం. మైక్రోకోస్మ్ రహస్యాల్లోకి చొచ్చుకొనిపోవాలంటే అత్యంత శక్తివంతమైన కణాలు అవసరం. కణాల్లో యింతటి శక్తిని త్వరితంగా నింపడానికి కొత్త పద్ధతులు అవసరం.

అయస్కాంత క్షేత్రంలో వుంచిన ప్లాస్మాలో ప్రధాన తరంగశక్తి లీనమైనపుడు అది ఆవేశిత కణాల చిన్న బృందాన్ని త్వరీకరించే పరిస్థితులను సృష్టించ గలుగుతుందని యీ బహుమతి గ్రహీతలు రుజువు చేశారు. యీ పద్ధతులద్వారా కణాలు తమ శక్తిని వందల వేల రెట్లలో పెంచుకుంటాయి. దీనివల్ల మైక్రోకోస్మ్ భౌతిక శాస్త్రానికి ఒనగూడే ప్రయోజనాలు యేమిటో వివరించాల్సిన పనిలేదు.

ప్లాస్మాతో సహచర్యను నెరిపే తీక్షణమైన విద్యుదయస్కాంత తరంగాల ప్రత్యేక ధర్మాన్ని తెలుసుకునే విజ్ఞాన శాస్త్ర నూతన శాఖకు సోవియట్ భౌతికశాస్త్రజ్ఞులు పునాదులు వేశారు. దీనికి సంబంధించి అనేక రచనలు చేశారు.

తరంగాల అధిక ఫ్రీక్వెన్సీ వత్తిడి శక్తి తరంగాలకు తరంగాలకు మధ్య, తరంగాలకు కణాలకు మధ్య అనునాద సహచర్యలాంటి మౌలిక భావనలను యీ రచయితలు విశదీకరించారు. యెన్నో ఫలితాలనిచ్చే ఒక సిద్ధాంతాన్ని అభివృద్ధిచేశారు. ప్లాస్మాపై ఒక బలమైన తరంగం పనిచేసినప్పుడు ప్లాస్మా తరంగాలను ''బంధించి వుంచిన'' తక్కువ సాంద్రతగల ప్రాంతాలు అనంతంగా కుప్పకూలి పోతాయి. యిదీ యీ సిద్ధాంతసారం.

గత 25 యేళ్లుగా, ప్లాస్మా భౌతికశాస్త్ర రంగంలో సోవియట్ శాస్త్రజ్ఞులు అగ్రేసరులుగా వున్నారు.



# అణుధూళీ, జీవకణము

శోషరస కణాలు అణు ధూళివల్ల చనిపోతాయని తెలిపే సిద్ధాంతాన్ని అభివృద్ధిచేసి అణుధూళివల్ల వచ్చే వ్యాధులకు సంబంధించిన లక్షణాలను అన్వేషించడంలో యీ సిద్ధాంత ప్రయోజనాన్ని విశదీకరించినందుకు ఒక శాస్త్రజ్ఞుల బృందానికి 1987 సోవియట్ ప్రభుత్వ బహుమతి లభించింది. ఆ కృషిలో పాల్గొన్నవారిలో ఒకరైన ప్రముఖ సోవియట్ రేడియో బయాలజిస్టు అలెగ్జాండ్ర్ కుజిన్ ఎ.పి.ఎన్. అభ్యర్థనపై ఆసక్తికరమైన యీ విషయాన్ని తెలియజేశారు.

40 యేళ్లక్రితం ప్రయోగించిన అణుబాంబువల్ల పెద్దయెత్తున ప్రాణనష్టం జరిగింది. అది విడుదలచేసిన అణుధూళివల్ల

వ్యాధులు పెచ్చరిల్లాయి. అణుధూళివల్ల సోకే వ్యాధుల స్వభావం గురించి అప్పుడు తెలిసింది చాలా తక్కువ. ప్రాణిపైనా, కణాలస్థాయిలో, అణువులస్థాలో దీనివల్ల సోకే వ్యాధిని గురించి మా బృందం ముమ్మరంగా అధ్యయనాలు ప్రారంభించింది. దీని ఫలితాలను సుదీర్ఘమైన **15** పరిశోధనా పత్రాల్లో **150** కి పైగా విజ్ఞానశాస్త్ర పరమైన వ్యాసాల్లో విశదీకరించడం జరిగింది. యీ అధ్యయనాలకు **1987** సోవియట్ ప్రభుత్వ బహుమతి లభించింది.

మానవుల, జంతువులలోని శోషరస కణజాలాలలోని కణాలు అణుధూళి ప్రసరించిన అనంతరం నాశనమయ్యే సాధారణక్రమాలను మొట్టమొదటిసారిగా ఆ అధ్యనాల్లో పేర్కొనడం జరిగింది. విభజనదశకు శోషరస కణాలు చేరుకోకముందే అవి పెద్దయెత్తున నాశనమయ్యే క్రమం పాత్రను మేము నిర్ధారించుకున్నాం. దీనినే కణనిర్మూలన అంతర్ దశ అంటున్నాం. అణుధూళివల్ల ఎముకలలోని మూలుగ నాశనమయ్యే క్రమంలో థైమోసైట్స్ (గుండెపై, రొమ్ము యెముకల వెనుక వుండే థైమస్ శోషరస కణాలు) నిర్మూలన అంతర్‌దశకుగల ప్రాముఖ్యతను మొదటిసారిగా మేము రుజువుచేశాం. రక్తం మామూలుగా రూపు గొనేందుకు థైమస్‌లోని టి-లింఫొసైట్స్‌కూ, మూలుగలోని కణాలకూ మధ్య సహకారం అవసరమని మేము తెలుసుకున్నాం. అణుధూళివల్ల దీనికి యేర్పడే అవరోధమే థైమోసైట్స్ నిర్మూలన అంతర్దశకు కారణం.

అణుధూళి ప్రభావంవల్ల డి.ఎన్.ఎ కు జరిగే హాని త్వరగా పరిహార మౌతుందని అందువల్ల పైన పేర్కొన్న కణ నిర్మూలన అంతర్దశకు ప్రత్యక్ష కారణం యిది కాదని మేము తెలుసుకున్నాం. జీవసంబంధమైన పొరల ధర్మాలు, విధుల్లో వచ్చే మార్పులు; కణాల శక్తి సంతులనంలో మార్పులు; అయాన్ సంతులనంలో మార్పులు; శోషరస కణాల్లో ఆర్.ఎన్.ఎ మార్పులో వక్రగమనాలు—అణుధూళి ప్రభావానంతరం కనిపించిన యీ లక్షాలను మేము కనుగొన్నాం. మొత్తంమీద ప్రోటీన్ పులియడానికి సంబంధించిన నిర్దిష్టమైన సంశ్లేషణకు యిది ఒకవిధమైన సూచికగా తోడ్పడింది. క్రోమాటిన్ విచ్ఛిత్తి రెండవదశకు కారణమిదే. యిదే కణాల నిర్మూలన అంతర్దశను తక్షణమే ముందుకు తెస్తుంది.

ఈ విధంగా పులియడానికి సంబంధించి యింతవరకూ తెలియని స్వభావాన్ని ధర్మాలను మేము నిర్ధారించాం. పులియడాన్ని నిరోధించి కణాలు నాశనం కాకుండా నివారించే మార్గాలను కనుగొన్నాం.

యీ ప్రాతిపదికపై మేము ప్రత్యేక విశ్లేషణా పద్ధతులను అభివృద్ధి చేశాం. అణుధూళి ప్రభావ తీవ్రతను తొలి దశలోనే కనుగొనేందుకు యిది తోడ్పడుతుంది. వీటిని అప్పటినుండి వైద్య చికిత్సలో ప్రవేశపెట్టడం జరిగింది.

సుసంపన్నమైన యీ పద్ధతులు అణుధూళికి సంబంధించిన ఆధునిక వైద్య, ఆరోగ్యశాస్త్రంలో వినియోగించడం జరుగుతోంది. ప్రాణాపాయమైన అణుధూళి ప్రభావాలను నిర్మూలించడానికి సమర్ధవంతంగా వినియోగించే యీ పద్ధతులు ప్రాథమిక రేడియో బయాలజీ అధ్యయనాల ప్రాతిపదికగా రూపొందించినవే. ప్రభుత్వ బహుమతి పొందిన అధ్యయనాల పరంపరలుకూడా వీటికి ప్రాతిపదికగా వున్నాయి.

ఈ అధ్యయనాల ప్రాతిపదికపై నిర్మాణానికి సంబంధించిన జీవక్రియని(సిద్ధాంతాన్ని రేడియో బయాలజీలో అభివృద్ధిచేయడం జరిగింది. ప్రాణిపై అణుధూళి ప్రభావ ప్రక్రియలను అవగాహనచేసుకోడానికి నిర్మాణపరమైన, జీవక్రియ పరమైన మార్పులను, సమైక్యంగా, పరస్పరాధారితంగాను అధ్యయనం చేయాల్సిన అవసరాన్ని తెలిపింది యీ సిద్ధాంతమే.

శోషరస కణాల నిర్మూలన అంతర్‌దశలో జన్యుకార్యక్రమ వునికిని తెలిపే పరికల్పనను మేము ప్రయోగాత్మకంగా రుజువుపర్చాం. తద్వారా సహజ పరిస్థితిలో శోషరస కణాల హార్మోన్ల వినాశనానికి సంబంధించిన ప్రాథమిక సూత్రాలను మేము ఆవిష్కరించాం. కణాల వినాశనానికి సంబంధించిన జన్యు కార్యక్రమం వునికిలో వుంటుందనే భావనను రేడియో బయలాజికల్ సమస్యల పరిష్కారంలో విజయవంతంగా వినియోగించినట్లయితే కణాల నిర్మూలన తిరస్కృతి ప్రాతిపదికగా గల పలురకాల వ్యాధిలక్షణాలను విశ్లేషించడంలో అది ఉపయోగపడగలదు.

# జీర్ణకోశంలోని పుండ్లకు నూతన పద్ధతుల్లో శస్త్ర చికిత్స

బెల్లా లుక్యానవా

"జీర్ణకోశంలోని పుండ్లకు నూతన పద్ధతుల్లో శస్త్రచికిత్సను అభివృద్ధి చేసి వైద్యరంగంలో ప్రవేశపెట్టి నందుకు" సోవియట్ సర్జన్లకు 1987 లో ప్రభుత్వ బహుమతి లభించింది. యీ పద్ధతిని వారు యేదో అకస్మాత్తుగా కనిపెట్టలేదు. యీ చికిత్స వాగోటమీ అనే పద్ధతిపై ఆధారపడినది. యిది యీ శతాబ్దారంభంనుండీ తెలిసినదే. రోగి పరిస్థితినిబట్టి శస్త్ర చికిత్సను కనిష్ట స్థాయిలో చేసే పద్ధతిని అభివృద్ధిచేయడంలో బహుమతీగ్రహీతలు విజయం సాధించారు.

ఈ పద్ధతిలోని ముఖ్యాంశమేమిటి?

ఆమ్లముల పరిమాణం అధికంగా వుంటే పుండ్లు పుడుతాయని యీ పద్ధతిని వివరిస్తూ యీ బహుమతి గ్రహీతలో ఒకరైన నికలాయ్ కుజిన్ వివరించారు. జఠర ఆమ్లాలను విడుదలచేసే కణాలకు సంచారనాడి (వేగస్‌నాడి) సంకేతాలను పంపుతుంది. యీనాడి పాక్షికంగా తెగిపోయినాసరే జఠరస స్రావం చాలా తగ్గిపోతుంది. జఠర ఆమ్లాల స్రావం తగ్గాలంటే సంచార నాడిని కత్తిరించాలన్నమాట.

1920 ల మధ్య కాలంలో వాగోటమీ, పద్ధతుల్లో పుండ్లకు చికిత్స చేయడానికి సోవియట్ వైద్యులు ప్రయత్నించారు. కాని అలాంటి శస్త్రచికిత్సలు చేయడానికి సాంకేతిక సౌకర్యాలు లేనందున విజయం సాధించలేకపోయారు. తర్వాత కొన్నాళ్లకు కృత్రిమ మార్గాన జఠరరసాన్ని చిన్నపేగుల్లోకి మళ్లించి జీర్ణకోశంపై జఠరరస ప్రభావం లేకుండా చేసే చికిత్సా పద్ధతి వచ్చింది.

50 వ దశకంలో వాగోటమీ పద్ధతిని పునరుద్ధరించడానికి అమెరికన్ సర్జన్ డ్రాగ్ స్టెడ్ట్ విఫల ప్రయత్నం చేశారు. తర్వాత యీ శస్త్ర చికిత్సను సరళం చేయడంలో మేము విజయం సాధించాం. సంచార నాడిని మొత్తంగా గాక దాని కొన్ని 'శాఖల' ను కత్తిరిస్తే నష్టమేమంత వుండదు సరికదా జీర్ణకోశం యధాతధంగా వుంటుంది.

జఠర ఆమ్లాల స్రావం తగ్గుతుంది. యీ కనిష్టస్థాయి శస్త్రచికిత్స పద్ధతివల్ల శస్త్రచికిత్స తర్వాత రోగులను 8 నుండి 10 రోజుల్లో ఆసుపత్రినుండి విడుదలచేయడానికి వీలేర్పడింది. సోవియట్ యూనియన్‌లో యిలాంటి చికిత్సలు పొందిన వేలాదిమంది యెలాటి యిబ్బంది లేకుండా తమ పనులను మునుపటిలాగానే చేసుకుంటున్నారు.



# భూగర్భ శాస్త్ర విజ్ఞాన సర్వస్వం

డాక్టర్ లెవ్ జొనెన్‌షేన్ (భూగర్భ శాస్త్రం, ఖనిజ శాస్త్రం)

సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ ఓషనాలజీ ఇన్‌స్టిట్యూట్‌లోని పేలియోజియో డైనమిక్స్ ప్రయోగశాల అధిపతి.

మాస్కో స్టేట్ యూనివర్సిటీ ప్రొఫెసర్, సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ కరెస్పాండింగ్ సభ్యుడు అయిన విక్టర్ ఖాయిన్ ''రీజినల్ జియో టెక్టానిక్స్'' పై సమర్పించిన ఐదు సంపుటాల పరిశోధనా పత్రానికి 1987 సంవత్సరపు సోవియట్ ప్రభుత్వ బహుమతి లభించింది. ఈ సంపుటాలను 1971 -1985 లలో ప్రచురించారు. ఆయన పరిశోధన భూగర్భ శాస్త్రానికి, జియో టెక్టానిక్ సిద్ధాంతానికి సంబంధించింది. సారంలో యిది భూగర్భ శాస్త్ర విజ్ఞాన సర్వస్వమే.

తమ పరిశోధనా పత్రంలో ప్రొఫెసర్ ఖాయిన్ భూమి ఉపరి పొరకు సంబంధించిన ప్రధాన నిర్మాణ విభాగాలను గురించి, ప్రధానంగా ప్రాచీన భూఖండాల, భూగర్భంలో ముడతలుగల మండలాల, సముద్రాల గురించి విశదీకరించారు. ప్రతి ఒక్క సంపుటిని ఒక ఖండానికో, దానిలో ఒక భాగానికో కేటాయించారు. ఐదవసంపుటిలో సముద్రాల పరిణామాల గురించిన విశదీకరణలున్నాయి.

ప్రతి ఒక్క సంపుటి ప్రాంతీయ సూత్రాలను ప్రాతిపదికగా చేసుకుని రచించినదే. రచన వరుసక్రమం అన్ని సంపుటాలకు ఒకే విధంగా వుంది — ఉపోద్ఘాతం, తత్సంబంధిత మండలానికి సంబంధించిన గత భూగర్భ అధ్యయనాలు, విడివిడి మండలాల వర్ణన. ప్రతిఒక్క అధ్యాయం, భూగర్భ పరిణామాల ప్రధాన దశలపై విశ్లేషణతో, రచయిత నిర్ధారణలతో ముగుస్తుంది.

రచయిత యీ కొన్ని ముఖ్య సిద్ధాంతాలను ప్రతిపాదించి గత పదిహేనేళ్ళుగా వాటిని మెరుగు పర్చి, ప్రచురించారు. లిథోస్ఫియర్ టెక్టానిక్స్‌కు సంబంధించిన నూతన సిద్ధాంతాన్ని అంగీకరించిన ప్రథముల్లో విక్టర్ ఖాయిన్ ఒకరు. ఖండాలు క్షితిజ సమాంతరంగా పెద్దయెత్తున కదులుతాయని, సముద్రాల మధ్య మండలాల్లో సరికొత్త సముద్ర ఉపరితలాలు రూపుగొంటాయని, సముద్రాల పరిధుల మండలాల వెంటగల ఖండాల్లో సముద్రాల పాత ఉపరితలాలు (ముఖ్యంగా పసిఫిక్ సముద్రానికి చెందినవి) హరించుక పోతాయని యీ సిద్ధాంతం తెలుపుతోంది.

భూమి పై పొర నిర్మాణానికి సంబంధించిన ఆరు రకాల టెక్టానిక్ సముదాయాలున్నాయని యీ శాస్త్రవేత్త అభిప్రాయం. అవి:

1. ప్రాచీన భూఖండాల పునాది. (తూర్పు — యూరపియన్, సైబీరియన్ యితర భూఖండాలు) యివి భూమి రూపుగొన్న తొలి దశలో 3.8 — 2.5 బిలియన్ యేళ్ల క్రితం యేర్పడినవి;

2. కొద్దిగా రూపుమారిన ప్రాచీన భూఖండాలపై బాగా పేరుకపోయిన మడ్డి పొరగలవి (తూర్పు యూరపియన్ భూఖండంపై అలాంటి పొర రూపుగొన్న మండలంలో మాస్కో వుందని ఆయన అభిప్రాయం)

3. ముడుత మండలాలు (ఊరల్స్, అపలాఛియాన్ పర్వతాలు, ఆల్ప్ — హిమాలయాలు). యివి గత 1.5 బిలియన్ సంవత్సరాలుగా రూపుగొన్నాయి. యివి భూఖండాలకన్నా యెంతో తరుణ నిర్మాణ స్వరూపాలు.

4. భూ ఖండాలపై, అదే విధంగా ముడుతమండాలపై పేరుకు పోయిన తరుణ మడ్డి పొరలు, వుదాహరణకు పశ్చిమ సైబీరియా మైదానం.

5. తరుణ ఒరోజెనిక్ (పర్వతమయ) వ్యవస్థలు. తియిన్‌షాన్, అల్తాయ్, కున్‌లున్, తదితర వాటితో సహా మధ్య ఆసియాలో తిరిగి రూపుగొన్న పర్వత శ్రేణుల మండలం లాంటివి.

6. సముద్రాలు :

ఈ సముదాయాలు ఒకదాని తర్వాత మరొకటి రూపొందినట్టు మనకు అవగతమౌతుంది. మన భూగోళ పరిణామాన్ని గురించిన నిర్ధారణలు చేయడానికి ఖాయిన్‌కు యిది తోడ్పడింది.

ఖాయిన్ నిర్ధారణలు మౌలిక స్వభావం గలవి. వీటిని ఆధునిక సాధారణ పరిణామ సిద్ధాంతాలు విస్మరించజాలవు. పైగా యీ నిర్ధారణలకు అవి భాష్యం చెప్పాల్సి వుంది.

విదేశాంగ విధాన సమస్యలు

ప్రపంచంలోని
ఉద్రిక్తతా ఆలవాలాలు

# నికరాగ్వాపై ఆర్థిక దిగ్బంధ విధాన వైఫల్యం

ఓల్గా ఉమ్నరెత్సేవా

*మధ్య అమెరికాను యెప్పుడూ తన "కీలక ప్రయోజనాల" మండలంగా పరిగణించిన అమెరికా పాలకవర్గాలకు యిప్పటికీ యెనిమిదేళ్ల నుండి స్వతంత్ర నికరాగ్వావునికి మింగుడు పడడంలేదు. అక్కడ అమెరికన్ ప్రభుత్వం టెర్రరిస్టు చర్యలకు బాహాటంగా తోడ్పడుతూ, ఆర్థికరంగంలో నికరాగ్వాకు హానికరంగా వత్తిడి తెస్తున్నది.*

## పెచ్చరిల్లిన ఆర్థిక దురాక్రమణ

ఈ వత్తిడిలో భాగంగా 1981 లోనే నికరాగ్వాకు ఆహార సప్లయిలను యితర ఆర్థిక సహాయాన్ని అమెరికా నిలిపివేసింది. అప్పుల విషయంలో లోగడ చేసిన వాగ్దానాలన్నిటినీ బుట్టదాఖలుచేసింది. అమెరికన్ కార్యక్రమంకింద, రీగన్ "కరిబియన్ చొరవ" అనే యీ కార్యక్రమంకింద సహాయం పొందే మధ్య అమెరికా, కరిబియన్‌దేశాల జాబితా నుండి నికరాగ్వా పేరును 1982 లో తొలగించింది. 1983 వసంత కాలంలో నికరాగ్వా నుండి చక్కెర దిగుమతులను 90 శాతం తగ్గించి, యంత్రాల, యంత్ర పరికరాల, రసాయనాల యెగుమతులను పరిమితం చేసింది. నికరాగ్వాకు సహాయాన్ని కొనసాగిస్తూ దానితో వ్యాపారం చేస్తున్న రాజ్యాలపై వత్తిడి తెచ్చింది; నికరాగ్వా రేవుల్లో, రేవులకు వెళ్లే మార్గాల్లో సి.ఐ.ఎ. 1984 మార్చిలో మందు పాతరలను పెట్టింది. నికరాగ్వాతో అమెరికా వ్యాపారాన్ని నిషేధించే 1985 మే ఒకటి నాటి ప్రభుత్వ వుత్తర్వు, విమాన సర్వీసుల రద్దు, అమెరికా రేవుల్లోకి నికరాగ్వా నౌకల ప్రవేశంపై ఆంక్షలు — యివన్నీ అమెరికన్ ఆర్థిక దురాక్రమణ వుధృతిలోని ప్రధాన ఘట్టాలు.

అంతేకాదు, అంతర్జాతీయ ద్రవ్య సంస్థలపై అమెరికా తన పలుకుబడిని ప్రయోగించి సాండినిస్టా ప్రభుత్వానికి అప్పులివ్వకుండా నిరోధించింది. 1979 - 1982 లలో నికరాగ్వాకు

అప్పులిచ్చిన యీ సంస్థలు 1983 లో అప్పులు నిలిపివేసినందువల్ల అది యెన్నో యిబ్బందులకు గురైంది

## తీవ్ర నిరసన

నికరాగ్వా అంతరంగిక వ్యవహారాల్లో అమెరికా జోక్యాన్ని వత్తిడి సాధనంగా అది విధిస్తున్న ఆర్థిక ఆంక్షలను ప్రపంచమంతా తీవ్రంగా నిరసించింది. అమెరికా చర్యలను దాని సన్నిహిత బంధు దేశాలుకూడా సమర్థించలేదు. లాటిన్ అమెరికా ఆర్థికమండలి సాధారణ సమావేశంలో పాల్గొన్నదేశాలు అమెరికన్ దురాక్రమణదారీ ఆర్థిక విధానాన్ని విమర్శించి, నికరాగ్వాపై విధించిన ఆంక్షలవల్ల తలెత్తిన యిబ్బందులను తగ్గించడా నికి తమ కృషిని కలబోయాలని తీర్మానించాయి. నికరాగ్వా అభ్యర్థనపై జరిగిన ఐ.రా.స. భద్రతా మండలి అసాధారణ సమావేశంలో అమెరికా ప్రభుత్వ చట్టవిరుద్ధ చర్యలను తీవ్రంగా విమర్శించడం జరిగింది. యీ వివక్షతాపూరిత చర్యలకు తక్షణమే స్వస్తిచెప్పాలని ఐ.రా.స. సర్వ ప్రతినిధిసభ 40 వ సమావేశం ఒక ప్రత్యేక తీర్మానాన్ని ఆమోదించింది.

## ప్రత్యక్ష నష్టాలు

అమెరికా విధించిన వ్యాపార ఆంక్షలవల్ల నికరాగ్వా విదేశీ వాణిజ్యం ఒక సంవత్సరంలో దాదాపు 15 శాతం తగ్గింది. దీనివల్ల వుత్పత్తి ఆధారరంగంలో తీవ్ర యిబ్బందులు యేర్పడ్డాయి. 1985 నాటి ఆర్థిక మాంద్యానికి ప్రధానకారణం యిదే. ఆంక్షలు విధించిన మొదటి సంవత్సరంలో ప్రత్యక్ష నష్టం 100 మిలియన్ల డాలర్ల మేరకు జరిగిందని సాండినిస్టా నాయకులు తెలియజేశారు.

వాణిజ్య సంబంధాలను విచ్ఛిన్నం చేసినందు వల్ల అమెరికాకు నికరాగ్వా సాంప్రదాయక ఎగుమ తులు బాగా తగ్గిపోయాయి. నికరాగ్వాలోగల 90 శాతం యంత్ర పరికరాలు అమెరికావే. అందువల్ల అమెరికానుండి ఎగుమతుల నిలిపివేతవల్ల విడి భాగాల కొరత యేర్పడి ఫ్యాక్టరీలు, వ్యవసాయ యంత్రాలు, రవాణా సౌకర్యాలు చాలావరకు నిలిచిపోయాయి. విద్యుత్ సరఫరాకు అంతరాయ మేర్పడింది. ప్రయివేటురంగంలోని పరిశ్రమలు బాగా దెబ్బతిన్నాయి. ప్రభుత్వ కంపెనీలకు కూడా యిబ్బందులు యెదురయ్యాయి. కాని సోషలిస్టు దేశాలనుండి, కొన్ని లాటిన్ అమెరికా దేశాలనుండి ముఖ్యంగా మెక్సికో నుండి లభించిన యంత్ర పరికరాలకు అనుగుణంగా ఆ పరిశ్రమలను సన్న ద్ధం చేయడం జరిగింది.

## విప్లవ ప్రభుత్వ కార్యక్రమం

అమెరికా విధించిన ఆంక్షలవల్ల వుత్పన్నమైన పర్యవసానాలను తొలగించడానికి నికరాగ్వా విప్లవ ప్రభుత్వం సామాజిక-ఆర్థిక కార్యక్రమాన్ని రూపొందించి దాని అమలుకు పూనుకున్నది. దేశీయ ధనరుల గరిష్ట వినియోగానికీ, ముడి వదార్థాలు, విద్యుచ్ఛక్తి, యింధనాల పొదుపునకూ, విడిభాగాల, యంత్ర పరికరాల నిల్వలను దృష్టిలో పెట్టుకుని వాటి సక్రమ పంపిణీకీ యీ కార్యక్రమం ఉద్దేశించినది.

తన వాణిజ్య భాగస్వాముల సంఖ్యను గణనీ యంగా పెంచుకోవడంలో నికరాగ్వా యెట్టకేలకు విజయం సాధించింది. స్మియా, ఇ.ఇ.సి, లాటిన్ అమెరికా, కెనడా, జపాన్, ఆసియాలోని కొన్ని వర్ధమాన దేశాలతో తన ఆర్థిక సంబంధాలను పెంచుకుంటోంది. నికరాగ్వా తన క్షేత్ర వుత్పత్తుల్లో (కాఫీ గింజలు, పత్తి, అరటిపండ్లు, పంచదార, నువ్వులు) యెక్కువభాగం యిప్పుడు పశ్చిమ యూరపియన్ మార్కెట్‌లో అమ్ముతోంది.

కోస్టారికా, హొండూరస్‌లతో నికరాగ్వా ద్వైపాక్షిక వాణిజ్య సంబంధాలను నెలకొల్పుకుంది. యితర మధ్య అమెరికా దేశాలకు ఒక మేరకు 1987 లో (1986 కన్నా) తన ఎగుమతులను పెంచ గలిగింది.

సోషలిస్టు దేశాలతో సహకారాన్ని పెంపొందించు కోడానికి సాండినిస్టా నాయకులు ప్రత్యేక శ్రద్ధ కనబర్చారు. అమెరికా వత్తిడివల్ల అంతర్జాతీయ ద్రవ్యసంస్థలనుండి, కొన్ని అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలనుండి ద్రవ్య, ఆర్థిక సహాయం బాగా తగ్గిపోయిన పూర్వరంగంలో సోషలిస్టుదేశాల సహాయం నికరాగ్వా ఆర్థిక వ్యవస్థ "మనుగడ" కు నిర్ణయాత్మకంగా తోడ్పడింది.

సోషలిస్టుదేశాలతో వాణిజ్యంవల్ల నికరాగ్వాకు యెంతో అవసరమైన యంత్రాలు, యంత్ర పరిక రాలు, రవాణా సాధనాలు, ట్రాక్టర్లు, యితర క్షేత్ర యంత్రాలు, ముడిపదార్థాలు, ఆహార, వినిమయ సరకుల సరఫరాకు హామీ యేర్పడింది. 1981







నికరాగ్వాలో కత్తెగోస్తున్నపంట
సోవియట్, క్యూబా సహాయంతో
నిర్మించిన చక్కెర శుద్ధి కర్మాగారం
మనాగ్వాలో జౌ. ఫ్యాక్టరి

- 1986 లో నికరాగ్వాకు సోవియట్ యూనియన్ 700 మిలియన్ల రూబుళ్లకు పైగా విలువగల సరకులను సరఫరా చేసింది. యీ దేశానికి చాలా ముఖ్యమైన చమురు, చమురు వుత్పత్తులను 1985 లో దాదాపు దాని మొత్తం అవసరాలకు సరిపోవునంతగా యెగుమతి చేసింది.

స్మియా, నికరాగ్వాలమధ్య సహకారానికి సంబంధించిన సంయుక్త కమిషన్ పరిధిలో బహుముఖ ఆర్థిక, శాస్త్ర, సాంకేతిక సహకారం ఫలవంతంగా అభివృద్ధి చెందుతోంది. యిది ప్రకృతి వనరులు, విద్యుచ్ఛక్తి, యింజనీరింగ్, పరిశ్రమలు, వ్యవసాయం, రవాణా, కమ్యూనికేషన్ సాధనాలలాంటి ఆర్థిక వ్యవస్థలోని ముఖ్యమైన రంగానికి పరివ్యాప్తమై వుంది.

నికరాగ్వాలో అమలుజరుగుతున్న ప్రగతిశీల సామాజిక, ఆర్థిక మార్పులు, విదేశీ ఆర్థిక సంబంధాల వ్యవస్థను మార్చడానికి జరుగుతున్న ఫలప్రదమైన కృషి — యివి ఆర్థిక, అంతర్జాతీయ సంబధాల చట్టాన్ని నిర్మించడానికి, జాతీయాభివృద్ధి కర్తవ్యాలను స్వతంత్రంగా నెరవేర్చడానికి తోడ్పడగలవు.

(లాటిన్ అమెరికా పత్రిక నుండి)

# స్టాలిన్ ఒక విశ్లేషణ

ప్రొఫెసర్ ద్మిత్రి ఎల్కొగొనోవ్ పి.హెచ్.డి "విజయం, విషాదం" స్టాలిన్ రాజకీయ రూప చిత్రణ అనే పుస్తకం రాసే పనిలో నిమగ్నమై వున్నారు. తన పుస్తకానికి ఆయన రాసిన ముందు మాటను సంక్షిప్త రూపంలో యీ దిగువ నిస్తున్నాం.

స్టాలిన్‌కు తనను గురించి పూర్తిగా తెలుసు.

తన జీవిత చరిత్రను జగజ్జేయమానంగా రాసేటట్లు ఆయన జాగ్రత్తపడ్డారు. అయితే మానవ జ్ఞాపకానికి దాని సొంత నియమాలున్నాయి. స్టాలిన్‌వంటి భారీ బండరాళ్ళు చరిత్ర పుటల్లో వుంటూంటాయి.

గత చరిత్రలో సత్యాలను పునరుద్ధరించేందుకు ప్రస్తుత పునర్నవీకరణ కృషిలో తలపెట్టడం ముదావహం. అందరూ ఇప్పుడు తమ దృష్టిని స్టాలిన్ పాత్రపై కేంద్రీకరిస్తున్నట్లు తోస్తున్నది. ఆయనపై దూషణ భూషణలు రెండూ కురుస్తున్నాయి.

చరిత్రలో అత్యంత వివాదాస్పదమయిన వారిలో స్టాలిన్ ఒకరు. ఆయన వ్యక్తిత్వాన్ని గురించి పరిశోధించేటపుడు చాలా సంక్లిష్టమైన సమయంలో యిమిడివున్న గతితర్కాలు ముందుకు వస్తాయని చెప్పక తప్పదు. చరిత్రను నిజాయితీతో పరిశీలించినట్టయితే సోషలిజం కోసం స్టాలిన్ చేసిన తిరుగులేని దోహదాన్ని గుర్తించక తప్పదు. అదే సమయంలో క్షమార్హం కాని ఘోర తప్పిదాలు, నేరాలు, ఎంతోమంది అమాయకులను క్రూరంగా అణచివేయడం కూడా మనం గమనించక తప్పదు. రాజకీయ,

సైద్ధాంతిక పోరాటంలో లెనినిజాన్ని పరి రక్షించిన స్టాలిన్. పార్టీలోని ఆయన ముఖ్య బృందం సోషలిస్టు నిర్మాణానికి మంచి ప్రాతిపదికను సృష్టించారు. పార్టీ అంత రంగిక యిబ్బందులు తొలిగి, విజయ పరం పరను సాగిస్తున్న సమయంలో స్టాలిన్ తన దారుణమైన సిద్ధాంతాన్ని ముందుకు తెచ్చారు. అది సోషలిజం ముందుకు సాగుతున్న కొద్దీ వర్గ పోరాటం మరింత ముమ్మరమవు తుందన్న పొరపాటు సిద్ధాంతం.

స్టాలిన్‌ను గురించిన అంచనాలో పెద్ద మార్పులు వచ్చాయని చరిత్ర స్పష్టం చేస్తు న్నది. 1940 లో స్టాలిన్ 70 వ జన్మ దినో త్సవం సందర్భంగా ఆయనకు పార్టీ కేంద్ర కమిటీ అభినందనలనూ, 1956 లో పార్టీ 20 వ మహాసభలో కృశ్చేవ్ ప్రసంగాన్నీ పోల్చిచూస్తే చాలు. అవి పరస్పరం విరుద్ధ మైన అభిప్రాయాలు వ్యక్తం చేశాయి. ఒకే బృందంవారే రెంటినీ వ్యక్తం చేశారు.

స్టాలిన్ చేసిన వాటిలో మంచిపనులా? చెడ్డపనులా ఏవి యెక్కువ? అని కేవలం లెక్కలతో గతాన్ని పరిశీలించబూనడం నైతికంగా సరికాదు. అసలు ప్రశ్న చాలా సంక్లిష్టమైనది: అధికార యంత్రాంగంలో విరూపత్వం యెక్కడనుంచి జనించింది? యిలాటి ప్రశ్నలపై పత్రికలవారు కేంద్రీక రిస్తున్నారు.

స్టాలిన్‌వంటి విప్లవ నాయకుల రాజకీయ, ఆర్గనైజేషన్ గుణగణాలను విశ్లేషించేటపుడు లెనిన్ పద్ధతులను దృష్టిలో పెట్టుకోవాలి. లెనిన్ 1922 డిసెంబరులో స్టాలిన్, ట్రాట్ స్కీల స్వభావాలను ఎలా అంచనా వేశారో స్టాలిన్ ఎన్నడూ మర్చిపోలేదు. "మొత్తం పార్టీ మనసు చూరగొన్న వ్యక్తిగా" బుఖారిన్ పేరును లెనిన్ పేర్కొనడాన్ని స్టాలిన్ ఆమోదించలేకపోయారు. లెనిన్ అంచనా లను స్టాలిన్ తన ప్రసంగాలలో ఎంతో జాగ్రత్తగా డొంకతిరుగుడు పద్ధతులలో వ్యతిరేకించారు. "మనం బుఖారిన్‌ను ప్రేమిస్తాం. అయితే మనం సత్యాన్ని, పార్టీని, కొమిన్‌టర్న్‌ను యింకా అధికంగా ప్రేమిస్తాం", అని స్టాలిన్ ఒక సందర్భంలో చెప్పారు యిదీ స్టాలిన్ పద్ధతి.

అయితే చరిత్ర పరిశోధకులకు యీ విషయంలో ఎన్నో యిబ్బందులు యెదురౌ తున్నాయి. మన చరిత్రలోని అనేక ఖాళీలకు స్టాలిన్ ఆయన బృందంలోని వారూ చాలా వరకు బాధ్యులు. కొన్ని పుటలు వక్రీకరణ లతో నిండాయి. కొన్ని మటుమాయ మయ్యాయి. యిది ఒక సమస్య.

స్టాలిన్ వ్యాసాలు, తీర్మానాలు మొదలైనవి ఆ వ్యక్తి ఆలోచనల గురించి మనకు యేమంత తెలుపవు. అయితే ఆయన తీసు కొన్న కొన్ని చర్యలు అర్థం చేసుకోవడం కష్టం. ఉదాహరణకు బుఖారిన్‌ను తీసు కుందాం. వారు అనేక సంవత్సరాలపాటు వ్యక్తిగతంగా ఎంతో స్నేహంగా ఉన్నారు. ట్రాట్‌స్కీయిజంతో పోరాటంలో ఆయన స్టాలిన్‌కు ఎంతో సాయంచేశారు. కాని ఎంతో ప్రజాభిమానం చూరగొన్న బుఖారిన్ వంటి నాయకుడిని చంపడం స్టాలిన్ ఆమోదంతోనే జరిగింది.

తనకున్న బలహీనతలలో ఒకదాన్ని తన బలంగా మార్చుకోడానికి స్టాలిన్ జీవితాంతం ప్రయత్నించాడు.

స్టాలిన్ తీర్మానాల ప్రతులన్నీ భద్రంగా వున్నాయి. వాటిని చూస్తుంటే యీ వ్యక్తి హేతు విరుద్ధతకు లోనైన కారణాలేమిటా అనిపిస్తుంది. చిన్నతనంలో మతపరమయిన పిడివాదం ఆయన మనసుకు యెక్కించడం కారణమా? ఇతర నాయకులపట్ల ఆయన కున్న మేధాపరమయిన ఈర్ష్యాసూయలు



స్టాలిన్ (ఎడమనుండి రెండవ వ్యక్తి) ఆయన బృందం — కె. వొరొషిలోవ్, ఎల్. బెరియా (వెనుకనున్న వారు) ఎం కాలినిన్, ఎస్ ఒర్జొనికిడ్జె, వి మొలొటోవ్. మే 1935

కారణమా? అక్టోబరు విప్లవానికి ముందు ఆయనలో జనించిన కాఠిన్యత కారణమా? స్టాలిన్ ముక్కోపి అనీ, అలాటి లక్షణాలు రాజకీయాలలో చాలా చెడు ప్రభావాలు కలిగిస్తాయని లెనిన్ ఒక లేఖలో పేర్కొన్నారు.

1920 లలో ట్రాట్‌స్కీ, కామనేవ్, జినొవీవ్‌వంటి వారు స్టాలిన్‌కన్నా ఎంతో ప్రసిద్ధులు. వారిలో కొందరు గొప్ప రచనలు చేశారు. ఉదాహరణకు ట్రాట్‌స్కీ వ్యాసాలు 17 సంపుటాల్లో ప్రచురించారు రచయితగా ఆయన ప్రతిభావంతుడు. లెనిన్ మరణానంతరం తాను అధికారాన్ని హస్తగతం చేసుకోవాలని ఆయన ప్రయత్నించారు. ట్రాట్‌స్కీ తన ప్రత్యక్ష, పరోక్ష విమర్శలను ఎక్కువగా స్టాలిన్‌పైనే చేశారు. ట్రాట్‌స్కీ దేశం విడిచి వెళ్ళిన అనంతరం స్టాలిన్‌ను జీవితాంతం ద్వేషిస్తూనే ఉన్నారు. స్టాలిన్‌ను గురించి యితరులందరికన్నా హెచ్చు తీవ్రంగా పరుషంగా దూషణలలో ఆయన రాశారు. అయితే ట్రాట్‌స్కీ పోరాడుతున్నది సత్యంకోసం కాదు. తానే నియంత కావాలనే వుద్దేశంతోనే ఆయన పోరాడాడు.

లెనిన్ మరణించడంతో యిక తానూ ట్రాట్‌స్కీ మాత్రమే నాయకత్వం కోసం తలపడతామని స్టాలిన్ గ్రహించారు. అయితే ట్రాట్‌స్కీని అధిగమించిన తర్వాత కూడా ట్రాట్‌స్కీ సమర్థించే అజ్ఞల బ్యూరాక్రసీ సరళిని, హింస, కాఠిన్యాలను స్టాలిన్ స్వయంగా స్వీకరించారు. యిది స్టాలిన్ విషాదానికి ఒక కారణం కాదా? యింకా యితర కారణాలేమిటో చూద్దాం.

పార్టీ 11 వ మహాసభ అనంతరం 1922 ఏప్రిల్ 3 న జరిగిన కేంద్ర కమిటీ ప్లీనం సమావేశం ప్రధాన కార్యదర్శి పదవిని నెలకొల్పింది. ఆ పదవి కీలకమైన దవుతుందని అప్పుడు ఎవరు భావించలేదు. అలా భావించి వున్నట్టయితే లెనిన్‌నే ఆ పదవికి ఎన్నుకునే

వారు. కార్యదర్శివర్గ దైనందిన కార్య కలాపాలను క్రమబద్ధం చేసేందుకు ప్రధాన కార్యదర్శిని ఏర్పరచారు. కామనేవ్ విపార్సుపై (లెనిన్ ఆమోదం తోనే) స్టాలిన్‌కు ఆ పదవి లభించింది. స్టాలిన్‌ను ఆ పదవి నుంచి మార్చేందుకు "ఏదో ఒక మార్గాన్ని చూడాల్సిందిగా" ఆ తరువాత సంవత్సరంలోపలే కేంద్ర కమిటీ సహచరులకు లెనిన్ చెప్పారు. అయితే లెనిన్ మరణించటంతో అది జరగలేదు. పార్టీ 13 వ మహాసభ (1924) ప్రతినిధులూ, కేంద్రకమిటీ సభ్యులూ లెనిన్ అభిప్రాయాన్ని అనుసరించలేదు. 1924 నాటికి స్టాలిన్ అనేకమంది నాయకులలో ఒకరు. ఆయన భవిష్యత్తులో రాక్షసాకారం దాలుస్తాడని అనాడు ఎవరూ వూహించలేదు.

అణచివేతలు ఎంత విస్తృత స్థాయిలో ఎంతటి తీవ్రంగా జరిగిందీ స్టాలిన్‌కు తెలుసునని దొరికిన పత్రాలబట్టి ఎవరైనా భావించక తప్పదని 1987 నవంబరు 2 న మిహాయిల్ గొర్బచేవ్ నివేదికలో పేర్కొన్నారు. నిజంగా స్టాలిన్‌కు అవన్నీ తెలుసు. అన్ని బులెటిన్‌లను స్టాలిన్ చదివారు. "గూఢచారి చర్యలు, టెర్రరిజం, నిర్దేశిత పంథాను తప్పడం" అనే పేరిట 1937 లో ఎంతమందికి శిక్షలు పడ్డాయీ అన్న లెక్కలతో నెలనెలా వచ్చే నివేదికలు కూడా ఆయనకు తెలుసు.

తన "శత్రువు"లని భావించిన వారిని స్టాలిన్ నిర్మూలించిన పద్ధతి ఒక దుష్టశక్తి విజయం పొందిన విషాదకర ఘటనగా తోస్తుంది. ఏమో ఎవరికి తెలుసు. ఈ క్రౌర్యంతోబాటు స్టాలిన్‌కు అజ్ఞాతమైన మానసిక రుగ్మత ఏదైనా వుండేమో. లేకపోతే స్టాలిన్ తన ప్రత్యర్థులను నిర్మూలించిన తరువాత కూడా, దేశం యుద్ధ కఠిన పరీక్షను యెదుర్కొనవలసి వున్న సమయంలో పార్టీలోనూ ప్రభుత్వంలోనూ అత్యుత్తమమైనవారిని "కూల్చి"వేయాల్సిన అవసరమే మొచ్చింది.

లెనిన్ మరణానంతరం పార్టీకి నాయకత్వం వహించడానికి ట్రాట్‌స్కీ, బుఖారిన్, రుద్జుతాక్, ప్రూంజె, రైకోవ్....వంటి వారికి నిజమైన అవకాశముండింది. అయితే 1930 ల ప్రారంభంవరకూ విప్లవనాయకులందరిలోనూ అత్యంత దీక్షాయుతుడుగా స్టాలిన్ వుండేవారు. ప్రప్రథమ సోషలిస్టు దేశాన్ని దృఢతరం చేసేందుకు పార్టీ పంథాను అతి బలంగా మనస్ఫూర్తిగా ఆయన సమర్థించారు. నిజమే. లెనిన్ సుగుణాలు ఆయనకు లేవు. అయితే యితరులకు కూడా ఆ సుగుణాలు లేవు. స్టాలిన్ అగ్రశ్రేణి సిద్ధాంతవేత్త ఎంతమాత్రమూ కాదు. ప్రజాస్వామ్య భావనా పరిరక్షకుడూ కాదు. ప్రముఖుడూ కాదు. అయితే నూతన సామాజిక వ్యవస్థ తన వునికి కోసం పోరాడుతున్న సమయంలో ఆయన దృఢ దీక్ష రాజకీయ మనోబలం కీలక అంశాలైనాయి. లెనిన్ తర్వాత ఈ విషయంలో స్టాలిన్‌తో సమానులెవరూ లేరు. యీ లక్ష్యాలకోసం పార్టీ యంత్రాంగాన్ని సమీకరించడంలో స్టాలిన్ వహించిన పాత్ర చిన్నదేమీ కాదు.

లెనిన్ మరణానంతరం ప్రజాస్వామ్యయుతమైన ప్రభుత్వం వుండినట్టయితే, మార్క్సిజం మహత్తర ఆదర్శాలకు విరుద్ధంగా ప్రవర్తించడమనేది వుండేదికాదు. మన మాతృభూమి కవచానికి లోతైన గాట్లు పడాల్సిన అవసరమే లేకుండానే సమాజపు సోషలిస్టు అభివృద్ధిని సాధించగలిగి వుండేవారమన్నది నా ప్రగాఢ విశ్వాసం. ఈ విషాదం తప్పించ వీలులేనంతటి దేమీకాదు.

# సోవియట్ భారత సాహిత్యాలలో ఉమ్మడి లక్షణాలు

ఇ. పి. చెలిషెవ్
సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడెమీ కరెస్పాండింగ్ సభ్యులు నెహ్రూ బహుమతి విజేత

మొదటి భాగం

ఇప్పుడు సోవియట్ యూనియన్‌గా రూపొందిన భూభాగంలోని ప్రజల జీవితాన్ని గురించి శతాబ్దాల క్రితం భారతీయులకు తెలుసునా? ఆవిషయాలు భారత సాహిత్యంలో ప్రతిబింబించాయా? ఈ ప్రశ్నలకు ఇప్పటివరకు సోవియట్ యూనియన్‌లో గాని, భారతదేశంలో గాని సరైన జవాబు దొరకలేదు. అసలు యిప్పటివరకూ యీ విషయమై లోతైన పరిశీలన కూడా ఎవరూ చేయలేదు. మధ్యయుగాల కాలంలో మా ప్రజల జీవితాన్ని గురించి భారత ప్రజలకు ఎంత తెలుసు అనే విషయంలో చాలా తక్కువ సమాచారం వున్నది. పూర్తి సమాచారం ఎప్పుడో ఒకప్పుడు లభిస్తుంది. మా దేశాన్ని సుదీర్ఘ గతంలో సందర్శించిన విద్యావేత్తలైన భారతీయులకు మా దేశాన్ని గురించి తెలుసనీ దాన్ని గురించి రాశారనీ అప్పుడు వెల్లడౌతుంది.

**10, 11 శతాబ్దాలలో వోల్గా - కాస్పియన్ వాణిజ్యమార్గం గుండా రష్యాకు వచ్చిన భారతీయ వ్యాపారులు ఆ విషయం రాసి వుండవచ్చు. 'వర్తమాన సంవత్సరాల మొహమ్మద్ తుగ్లక్ కాలంలో రష్యన్ భూభాగాలకు చేరుకున్న వ్యాపారులు ఆ విషయాలు రాసి వుండవచ్చు. ఉత్తరాది పొరుగు దేశాలతో భారతదేశ వ్యాపారాన్ని తుగ్లక్ ప్రోత్సహించినట్టు ఇబన్ బతూతా రాశారు. రష్యన్ రాకుమారుడు వాసిలీ ఇవా నొవిచ్ (1479-1533) కాలంలో బాబర్ పంపిన దూతలు ఖ్వాజా హుస్సేన్ తదితరులు మధ్య యుగాల రూస్‌ను దర్శించారు. వారు తమ అనుభవాలను ఎక్కడో ఒకచోట రాసి వుంటారని భావించవీలుంది. 'వాసిలీతో మైత్రిని కోరుతున్నానని, రెండు దేశాల మధ్య వాణిజ్యాన్ని అభిలషిస్తున్నానని' బాబర్ లిఖితపూర్వక సందేశంలో పేర్కొన్నట్టు 'నికన్ క్రానికిల్'లో నమోదైంది.**

**భారతదేశంపై వలసవాదులు పట్టు చిక్కించుకోవడంతో సాంప్రదాయికంగా భారతదేశానికి యితర ప్రపంచంతో గల**

ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలు తెగి పోయాయి. 18 వ శతాబ్దాంతం నుంచి రష్యాను గురించి భారతదేశానికి తెలిసింది చాలా తక్కువ. రష్యాను గురించి నిజాలు భారతదేశానికి తెలియకుండా బ్రిటిష్ అధి కారులు నిరోధించారు.

"రష్యా గురించి మేం తెలుసుకోకూడ దని వారి వుద్దేశం. రష్యా గురించి మాకు చెప్పిందంతా కథలు కల్పిత గాథల్లా వుండేది" అన్నారు భారత రచయిత హసన్ షహిత్ సహ్రవర్ది.

గత శతాబ్దాలలో రష్యాను దర్శించిన భారతీయులు ఎంతో తెలివైనవారు సాహస వంతులు అన్వేషకులు. వారు తమ యాత్ర లలో చూసిన, తెలుసుకున్న విషయాలను గురించి నమోదు చేయలేదని భావించడం సమంజసం కాదు. అఫనాసి నికితిన్, గెరాసిం లెబెదెవ్ వంటి రష్యన్ యాత్రికుల లాగా భారత యాత్రికులు కూడా రష్యాలో పర్యటించి వుంటారన్నది నిస్సందేహం. మా దేశం గురించి భారతీయులు ఆనాడు రాసిందంతా ఏమీ మిగలకుండా పోయిందని నమ్మజాలము. ఎన్. ఎం. కరాంజిన్ వంటి పరిశోధకుడు భారతదేశంలో కూడా ఆ వాస్తవాలను వెలుగులోకి తెస్తాడని మేం ఆకాంక్షిస్తున్నాం. అఫనాసి నికితిన్ రాసిన "మూడు సముద్రాలు దాటిన యాత్ర" రాత ప్రతిని 19 వ శతాబ్దారంభంలో ఆయన కను గొన్నారు. "రష్యన్ సామ్రాజ్య చరిత్ర" కోసం సమాచారం సేకరిస్తున్న సమయంలో పురాతన పత్రాలలో యిది దొరికింది. అలాగే యిప్పటి కింకా పరిశోధించకుండా వుండిన ప్రాచీన పత్రాలలో భారత పరిశోధ కులు కూడా అలాటి సమాచారాన్ని సేక రించగల్గుతారని ఆశిస్తున్నాం. 19 వ శతాబ్దం చివర్లో, 20 వ శతాబ్దం ఆరంభం లోనే భారత ప్రజలు రష్యన్ సాహిత్యాన్ని గురించి తెలుసుకున్నారని రెండు దేశాల మధ్య సాహిత్య సంబంధాల్ని అధ్యయనం చేస్తున్న పరిశోధకులు అంటున్నారు.

మా దేశంలో పూర్వీకులు భారతదేశం గురించి ఎంత మేరకు తెలుసుకున్నారో చూద్దాం.

చాలా ప్రాచీన కాలంలోనే రష్యన్ ప్రజలను భారతదేశం ఆకర్షించింది. అసలు రష్యన్ లిపి ఏర్పడిన నాటినుండి తొలి రచనల్లో సైతం భారతదేశాన్ని గురించిన ప్రస్తావన అనేకరూపాలలో వుంది. రష్యాలో క్రిస్టియన్ మతం పాదుకొన్న అనంతరం గ్రీకు, దక్షిణ స్లావ్ భాషల పుస్తకాలు దేశంలోకి కుప్పలు తెప్పలుగా వచ్చాయి. భారతదేశం గురించి, ప్రాచీన భారత సాహి త్యాన్ని గురించి అవి రష్యన్ ప్రజలకు తెలిపాయి. అపార సంపదలు సౌందర్యంతో తొణికిసలాడే ఒక అద్భుత భూమిగా ప్రాచీన కథలు, గాథలు చరిత్ర పుటలలో భారత దేశం సాక్షాత్కరించింది. "వర్లాం కథ, భారత రాకుమారుడు ఐయొసాఫ్"ను 12 వ శతాబ్దంలో రష్యన్ ప్రజలు చదివారు. "బోధిసత్వ" అనే పదంనుంచి వుద్భవిం చింది, ఐయొసాఫ్. ప్రాపంచిక సౌఖ్యాలను పరిత్యజించి ఎడారికెళ్ళిన భారత రాకుమారుని గాథ మధ్యయుగాలనాటి క్రిస్టియన్ తాత్వి కతకు అనుగుణమైనదే. "భారత రాజ్యగాధ". 13 వ శతాబ్దంలో రష్యాలో ప్రాచుర్యం పొందింది. భారతదేశాన్ని గురించి తెలప డంలో అది ముఖ్యపాత్ర వహించింది. అద్భుతమైన ప్రజలు, వృక్ష జంతువితతి గల బలమైన ఆసియా రాజ్యంగా భారత దేశాన్ని గురించి ఆ పుస్తకం తెలిసింది. "గాధ" తదితర మధ్య యుగపు రష్యన్

రచనలలో భారతదేశం గురించి వాస్తవాలతోపాటు చిత్ర విచిత్ర భావనలు కలగలసి వుంటాయి.

మధ్య ఆసియా ట్రాన్స్ కాకసస్ ప్రజలతో భారత దేశ సంబంధాలు యింకా ప్రాచీనమైనవి. క్రీ.శ. మొదటి శతాబ్దంలో మధ్య ఆసియా సంస్కృతి కుషాణులతో భారత దేశంలోకి ప్రవేశించింది; బౌద్ధమతం, యింకా ఎన్నో భారత సంస్కృతి వైభవాలు మధ్య ఆసియాలో విస్తరించాయి. ఎన్నో బౌద్ధ తాళపత్ర గ్రంథాలను మధ్యాసియాలో కనుగొన్నారు.

భారతదేశంలోని పర్షియన్ భాషా సాహిత్యంలో పేరెన్నికగన్న రచయిత అమిర్ హస్రొ దెహ్లావి (13-14 శతాబ్దాలు) మధ్యాసియాలో ట్రాన్స్ కాకసస్‌లో ఎంతో ప్రాచుర్యం పొందారు. 20 వ శతాబ్దంవరకూ కూడా తజిక్, అజర్‌బైజాన్, ఉజ్బెక్‌లలోని పర్షియన్ కవులు ఆయన కవితల్ని అనుకరిస్తూ వచ్చారు.

జహీరుద్దీన్ మహమ్మద్ బాబర్ (15-16 శతాబ్దాలు) ఫెర్గానాలో జన్మించారు. ఆయన భారతదేశంలో మొగల్ సామ్రాజ్య స్థాపకుడు మాత్రమే కాదు. గొప్ప పండితుడు, రచయిత కూడా. మధ్యాసియా టర్కీ భాషలో రాసిన "బాబర్ నామా" ఆనాటి జ్ఞాపకాల గొప్ప పుస్తకం. మధ్యాసియాలో టర్కీ భాషా సాహిత్యాభివృద్ధికి ఎంతో ముఖ్యపాత్ర వహించింది.

భారత దేశ కవి, చింతకుడు మీర్జా అబ్దుల్ కాదర్ బెదిల్ (17-18 శతాబ్దాలు) పర్షియన్ రచనలు మధ్యాసియా, మధ్య ప్రాచ్య దేశాలలో 18-20 శతాబ్దాల సాహిత్యాభివృద్ధికి ఎంతో దోహదం చేశాయి. తజిక్, ఉజ్బెక్ సాహిత్యాలలో "బెదిలిజం" ప్రభావం 20 శతాబ్దారంభం వరకూ వుంది. "ప్రజ్ఞానం" అనే శీర్షికతో బెదిల్ రాసిన తాత్విక గ్రంథం ఎందరినో ఆకట్టుకుంది. "కామ్దె, మొదన్" కవిత అందులో వుంది.

భారత, మధ్యాసియా ప్రజల సాంస్కృతిక సాంప్రదాయాల స్వర్ణ భాండాగారంలో పలువురు మధ్యాసియా పండితుల, కవుల కృతులు వున్నాయి. 11 వ శతాబ్దానికి చెందిన విజ్ఞాన సర్వస్వ రచయిత ఖొరెజెంకుచెందిన అబూరీహాన్ అల్ బిరూనీ భారత దేశంలో దీర్ఘకాలం వున్నారు. సంస్కృతం అధ్యయనం చేశారు: అరబిక్ భాషలో అయన రాసిన "భారతదేశం" మధ్యయుగాల నాటి భారత చరిత్ర తెలుసుకోడానికి యేకైక మూలాధారం. ఆయన కాలంలోనూ అంతకు ప్రాచీన కాలంలోనూ భారత దేశపు సంస్కృతి, విజ్ఞాన శాస్త్రాలు, వివిధ ప్రాంతాల జాతులు, భౌగోళిక వివరాలు, మతం, తాత్వికత — యిలా యెంతో విస్తృత విషయాల గురించి యిప్పటికీ యెంతో విలువైన సమాచారం అందులో వుంది. భారత దేశ తాత్విక, సాంస్కృతిక జీవితాన్ని గురించి మధ్యప్రాచ్యం, నైరుతి ఆసియాలో ప్రజలకు ఆయన పరిచయం చేశారు.

భారత ప్రజలు, ట్రాన్స్ కాకసస్ ప్రజల మధ్య సాంస్కృతిక సంబంధాలు ఎంతో ప్రాచీనమైనవి. మధ్య యుగాల కాలంలో ఎందరో జార్జియన్ కవులు భారత దేశాన్ని యితివృత్తంగా తీసుకున్నారు. జార్జియా, భారతదేశాల మధ్య ఎంతో కాలంగా సాంస్కృతిక సంబంధాలున్నాయని యిది రుజువు పరుస్తున్నది. 12 వ శతాబ్దానికి చెందిన గొప్ప జార్జియన్ కవి షోతారుస్తవెలి "పులిచర్మం ధరించిన వీరుడు"లో యితివృత్తం రామాయణ యితివృత్తంతో పోల్చ

వీలుంది. ఆయన కాలంలో మత, తాత్విక, సామాజిక, రాజకీయ అభిప్రాయాలను తన సొంత గడ్డమీద నుంచి బహిరంగంగా ప్రవచించడం అసాధ్యమైనందునే ఆ కథ భారతదేశంలో జరిగినట్టు చెప్పి వుంటాడని పండితుల అభిప్రాయం. అయితే అదే ప్రధాన కారణం అని నమ్మజాలము. రుస్తవెలి సృష్టించిన పాత్రలు అందరికీ సుఖ సౌభాగ్యాలు లభించాలని పోరిన యోధులు. సత్యం కోసం, న్యాయం కోసం పోరిన యోధులు. వాల్మీకి రామాయణం లాగానే రుస్తువెలి ఆదర్శం దృఢమైన, సమైక్యమైన రాజ్యం; మానవతా భావన గల మేధావంతుడైన చక్రవర్తి అధిపతిగా వుండే రాజ్యం. షోతా రుస్తు వెలి తన కాలంలో భారత దేశాన్ని సందర్శించినట్టు ఒక కథ ప్రచారంలో వుంది.

రష్యన్ భాషలో, సోవియట్ యూనియన్ లోని యితర భాషా సాహిత్యాలలో భారత దేశ యితివృత్తాలు తీసుకోవడం భారతదేశ ప్రభావానికి నిదర్శనం. రెండు దేశాల మధ్య సాంప్రదాయక సంబంధాలవల్ల మాత్రమే కాక, సామాజిక చారిత్రక, సాంస్కృతిక అభివృద్ధిలోని వుమ్మడి నియమాలవల్ల కూడా రష్యా, భారత దేశాల సాహిత్య క్రమాలలో వుమ్మడి లక్షణాలు యేర్పడ్డాయి.

మన రెండు సంస్కృతులకు వుమ్మడి మూలాలు వున్నందున యీ బాంధవ్యం ఏర్పడింది. ప్రాచీన భారతీయులకు స్లావ్‌లకు బంధుత్వం వున్నది. 19వ శతాబ్దా రంభంలో సంస్కృతాన్ని అధ్యయనం చేయడం ఆరంభించిన రష్యన్ భాషా శాస్త్రజ్ఞులు రష్యన్ భాషకూ సంస్కృతానికీ గల సన్నిహిత సంబంధాన్ని తెలుసుకుని ఆశ్చర్య పోయారు. పీటర్స్‌బర్గ్ పండితుడు ఎఫ్. అదెలుంగ్ 1811లో "సంస్కృతం రష్యన్ భాషల సారూప్యత" అనే చిన్న పుస్తకాన్ని ప్రచురించారు. అది చాలామందిలో ఆసక్తి కలిగించింది. "స్లావ్ సంస్కృతాల మధ్య సంబంధం" గురించి బి. డార్న్ అధ్యయన పత్రం 1833 లో ప్రచురిత మైంది. రష్యన్ తదితర స్లావ్ ప్రజల ఆవిర్భావం గురించి అధ్యయనంలో భాగంగా యీ రెండుభాషల మధ్య సంబంధం కూడా చర్చించారు. ఎన్. కరాంజిన్, ఎన్. పొలెవోయ్ అనే రష్యన్ చరిత్రవేత్తల దృష్టిని యిది ఆకర్షించింది. రష్యన్ ఇండాలజిస్టులు సంస్కృతాన్ని అధ్యయనం చేయడంపై కేంద్రీకరించారు. ఆర్. లెంత్స్, ఎన్. నొదెజ్‌దిన్, షి. పెత్రోవ్, ఎస్. షెవిరెవ్, కె. కొసోవిచ్ ప్రభృతులు అందులో వున్నారు. వారి కృషిఫలితంగా "మహాభారతం", "రామాయణం", "అభిజ్ఞాన శాకుంతలం", "ఊర్వశి" తదితర సంస్కృత సాహిత్యం గురించి రష్యన్ ప్రజలు తెలుసుకోగలిగారు. రెండు దేశాల భాషా బాంధవ్యాలు, సంస్కృతులలో సారూప్యత, పరస్పర ప్రభావాలు అనే అంశం రష్యన్ పాత్రికేయుల దృష్టిని ఆకర్షించింది. ఈ అంశాలపై కేంద్రీకరించిన వారిలో వి. వి. స్తసోవ్ ఒకరు. రష్యన్, భారతీయ గాధలనుంచి, జాన పదాల నుంచి ఆయన ఉదాహరణ లిచ్చారు. 1868 లో "వెస్త్నిక్ యెవ్రోపీ" పత్రికలో "రష్యన్ వీరగాథల ఆవిర్భావం" అనే వ్యాసం ఆయన ప్రచురించారు. "మహాభారతం"లోని కథలకూ రష్యన్ వీరగాధలకూ సారూప్యాలను గురించి ఆయన పేర్కొన్నారు. దోబ్రిన్య నికితిచ్‌కూ కృష్ణునికీ సారూప్యాన్ని ఆయన చర్చించారు. "నొవ్‌గొరొదియా వర్తకుడు సాద్కో భారతీయ రాజు యదువుకు రష్యన్ రూపం

తప్ప వేరుకాదు....మన సముద్ర రాజు వొద్యానికి పాములరాజైన నాగరాజే" అని ఆయన రాశారు. యిది ప్రజల్లో పెద్ద చర్చ రేపింది. ఎ. ఎన్. వెసెలొవ్‌స్కీ, ఎం. ఎన్. స్పెరాన్‌స్కీ, వి. ఎం. ఇస్త్రిన్ వంటి విఖ్యాత సాహిత్యకారులు, మధ్య యుగాల రష్యన్ సాహిత్యంలో భారతీయ వృత్తాంతాలను గురించి రాశారు.

ఈ రెండు మహత్తర రాజ్యాల బాంధవ్యం, వుమ్మడి మూలాలు అనే భావన వర్ణ చిత్రకారుడు నికొలాయ్ రోరిక్ దృష్టిని ఆకట్టుకుంది. ఆయన జీవితమంతా యీ అంశంపై కృషికే ధారపోశారు. "మన ఆచార్య వ్యవహారాలు, శ్మశానాలు, పనిముట్లు యింటికట్టు, తలకట్టు, వేషభాషలు, గోడల మీద చిత్రాలు, మన మూల పదాలు యివన్నీ వుమ్మడి మూలాల్ని సూచిస్తున్నాయి" అని రోరిక్ రాశారు.

రామాయణ భారతాలతో పోల్చగల రష్యన్ వీరగాథ లున్నాయి. ప్రాచీన కాలంలో నిజంగా జరిగిన ఘటనలను అద్భుతమయిన రూపంలో వర్ణించారు. వీటిలోని వీర పాత్రలు భారత పురాణ గాథల్లోలాగానే ప్రజల్లో పాతుకుపోయివున్నాయి. రాముడు, లక్ష్మణుడు, సీత, ధర్మరాజు, అర్జునుడు, ద్రౌపదిల లాగానే ఇల్యామురోమెత్స్, అల్యోషాపొపోవిచ్, వాసిలీ బుస్లయెవ్ మికులాసాలెనికోవిచ్ వంటి వీరులు, స్త్రీ పాత్రలు గొప్ప నైతిక గుణ సంపన్నతకూ, బల శక్తికీ, ఆత్మత్యాగానికీ, దేశంపట్ల అంకిత భావానికీ చిహ్నాలుగా రష్యన్ ప్రజల హృదయాల్లో చోటుచేసుకున్నాయి. ఇల్యా మురొమెత్స్‌ను భీమునితోను, ఆంజనేయునితోను, పోల్చవచ్చు. రాకుమారుడైన వ్లాదిమిర్‌కు ఇల్యాముర్మొత్స్ సాయంచేశాడు. అలాగే ప్రతినాయకులైన రావణునితో పోల్చదగ్గ దావులేవి కస్చీ లేదా బందిపోటు సొలొవీలను పోల్చవచ్చు. వారిని ఇల్యా మురొమెత్స్ ద్వంద్వ యుద్ధంలో ఓడించాడు.

12 వ శతాబ్దంలో చంద్ బార్దాయ్ రాసిన "పృధ్వీరాజ్-రాసో" వీర గాధతో మధ్య యుగాల రష్యన్ సాహిత్యంలో అనర్ఘ రత్నం "ది లే ఆఫ్ ఇగోర్స్ హోస్ట్"ను పోల్చవచ్చు. యివి రెండూ హిందీ, రష్యన్ సాహిత్యాల అభివృద్ధిలో ముఖ్యపాత్ర వహించాయి. తమ తమ దేశాలు కష్టకాలంలో వున్నప్పుడు రాసినవి. సుల్తాన్ షహబుద్దీన్ గోరి సేనల దాడులను తిప్పికొట్టేందుకు ఢిల్లీ మహారాజు పృధ్వీరాజ్ జరిపిన పోరాటాన్ని భారత వీరగాధ వర్ణించగా, దేశాన్ని కొల్లగొడుతూ దగ్ధం చేయవచ్చిన సంచార జాతులకు వ్యతిరేకంగా రూస్ రాకుమారుడు ఇగోర్ స్త్యతోస్లవిచ్ పోరాటాన్ని రష్యన్ వీరగాధ వర్ణించింది. ఈ రెండు కధల్లో చాలా సారూప్యా లున్నాయి. పృధ్వీరాజ్ ఇగోర్ యిద్దరూ ఓడిపోయి ఖైదీలుగా పట్టుబడ్డా, వీరోచితంగా ప్రవర్తించారు రాణి సంయుక్త భర్త మరణించిన వార్తవిని ప్రాణత్యాగం చేసింది. రష్యన్ రాకుమారి యెరొస్లావ్నా విషాదసాగరంలో మునిగిపోతుంది. మధ్య యుగాల భారత దేశంలో మధ్యయుగాల రష్యా దేశంలో ఆయా పరిస్థితులలో రాసిన గాథలు యివి; కేవలం కథలోనే కాదు. పాత్రల మనోభావాల స్వభావాల చిత్రణలో రెంటికీ యెన్నో సారూప్యాలున్నాయి.

బహుశా అందువల్లనేమో భారతీయ జానపద గాథలు, నీతికథలు బుద్ధ జాతక కథలు చదువుకుని భారతదేశం నుంచి రష్యా ప్రేరణ పొందాలని లియో టాల్‌స్టాయ్ ఆకాంక్షించారు.

# భారతదేశం కోసం భారతదేశం గురించిన సోవియట్ కొత్త పుస్తకాలు

వ్లదీమిర్ లాన్కిన్

**సోవియట్ రచయితల 250-260 పుస్తకాల అనువాదాలను ప్రతి యేటా 12 భారతీయ భాషల్లో సోవియట్ యూనియన్ ప్రచురిస్తోంది. వీటితోపాటు ఇంగ్లీషులో దాదాపు 300 పుస్తకాల అనువాదాలను భారతదేశ ప్రచురణ సంస్థలకోసం ప్రచురిస్తున్నది.**

ప్రగతి ప్రచురణాలయంలోని ఒక పుస్తకాల షాపు



రష్యన్ పుస్తకాలతో సహా 650 కి పైగా పుస్తకాల అరు మిలియన్ల ప్రతులను భారత దేశానికి యేటా సోవియట్ యూనియన్ పంపుతోంది.

మాస్కోలో భారతదేశ ఉత్సవాల ప్రారంభాన్ని పురస్కరించుకొని 20 వ శతాబ్దపు సోవియట్ సాహిత్యపు మొదటి రెండు సంపుటాలను హిందీలో రాదుగా ప్రచురణాలయం, రష్యన్‌లో భారతీయ సాహిత్యాన్ని రెండు సంపుటాల్లో కుడా జెన్విన్నయాలితురాతురా ప్రచురణాలయం విడుదల చేశాయి.

భారతీయ భాషల్లో రష్యన్ ప్రామాణిక సాహిత్యాన్ని ప్రచురించిన ఘనత "రాదుగా" ప్రచురణాలయానికి దక్కింది. అది ఇటీవల ప్రచురించిన వాటిలో కొన్ని ఇవి: మరాఠీలో అలెక్సాండ్ర్ పుష్కిన్ "బెల్కిన్ టేల్స్"; తెలుగులో మిహాయిల్ లెర్మెన్‌తోవ్ "ఎ హీరో ఆఫ్ అవర్ టైమ్స్"; బెంగాలీలో నికొలాయ్ గోగోల్ "టేల్స్ అండ్ స్టోరీస్"; హిందీలో ఇవాన్ టర్జెనెవ్ "ఆన్ ది ఈవ్", బెంగాలీలో "ఫాదర్స్ అండ్ సన్స్"; హిందీలో ఫొదొర్ దోస్తొవాస్కీ "ది ఇడియేట్స్"; టాల్‌స్టాయ్ రచనలు "వార్ అండ్ పీస్"ను హిందీలో, "ది రిసరెక్షన్"ను బెంగాలీ, పంజాబీలలో, "అన్నా కెరీనా"ను పంజాబీ, ఉర్దూలలో; అలెక్సాండ్ర్ కోప్రిన్ రచన "ది గార్నెట్ బాంగిల్"ను తమిళంలో ప్రచురించింది.

'రాదుగ' ప్రచురణాలయం 1986-87 లో యీ కింది సోవియట్ రచయితల సాహిత్యాన్ని భారతదేశ పాఠకులకు అందించింది: బెంగాలీలో కన్‌స్తన్‌తీన్ పెమనోవ్ "లైవ్ అండ్ డెడ్", మక్‌సౌద్ ఇబ్రాగిమ్‌కోవ్ "కలెక్టెడ్ వర్క్స్", వి. బొగొమెలోవ్ "ఇవాన్"; గుజరాతీలో అలెక్సాండ్ గ్రిన్స్ "ది స్కార్‌లెట్ నెయిల్స్"; మరాఠీలో వ్లదీమిర్ షుష్కిన్ "స్టోరీస్"; పంజాబీలో విరాపనోవా "ఫెలో ట్రావెలర్స్"; తమిళంలో మిహాయిల్ షోలొఖోవ్ "వర్జిన్ సాయిల్ అప్ టర్న్డ్"; హిందీలో గియోర్గి మార్కవ్ "సైబీరియా", ఎన్ సుందిక్ "ది వైట్ షామన్" లను ప్రచురించింది.

ప్రగతి ప్రచురణాలయం (మాస్కో) 1987 లో "ఎ.బి.సి ఆఫ్ సోషల్ అండ్ పొలిటికల్ నాలెడ్జ్" అనే పేరుతో 20 సంపుటాల సీరియల్ ప్రచురణను కొనసాగింది. వీటిలో 12 పుస్తకాలను పాకెట్ సైజులో హిందీ, బెంగాలీ, మరాఠీ, పంజాబీ, తదితర భాషల్లో ప్రచురించారు. "డెవలప్‌మెంట్ ఆఫ్ కెపిటలిజమ్ ఇన్ ది కంట్రీస్ ఆఫ్ ది ఓరియంట్" అనే ఎన్. సిమెనియా పుస్తకాన్ని హిందీలో, బెంగాలీలో. "సివిల్ లా అండ్ ప్రొటెక్షన్ ఆఫ్ హ్యూమన్ రైట్స్ ఇన్ యు.ఎస్.ఎస్.ఆర్." అనే ఎ. మలేయిన్ పుస్తకాన్ని హిందీ, బెంగాలీ భాషలతో సహా కొన్ని భారతీయ భాషల్లో ఇటీవల ప్రచురించారు.

మీర్ ప్రచురణాలయం భారతీయభాషల్లో విజ్ఞాన శాస్త్ర, సాహిత్య పుస్తకాలను ప్రచురిస్తోంది. 1986 లోనే అది 20 కి పైగా పుస్తకాలను ప్రచురించింది. వాటిలో కొన్ని యివి: ఎల్. లాండా, యు. రుమెర్ "వాటీజ్ ది థియరీ ఆఫ్ రిలేటివిటీ"; మరాఠీలో "హవ్ కెమికల్ ఎలిమెంట్స్ వర్ డిస్కవర్డ్?"; తెలుగు, బెంగాలీలో వి. యుదెవిచ్ "ఫస్ట్ ఎయిడ్ ఫర్ ట్రామాస్"; తెలుగు, మరాఠీలలో ఫ్యొదరోవ్ - దవ్యదోవ్ "ది కాయన్స్ స్పీక్"; తెలుగులో ఎవగెని ఛాజివ్ "ది హార్ట్ అండ్ ది ట్వెన్టియత్ సెంచరీ"; ఇయోరిష్ "బీస్ ఇన్ మాన్స్ లైఫ్"; బెంగాలీలో వి. గ్లుష్కోవ్ "వాటీజ్

సైబర్నెటిక్స్?". హిందీలో యా. పెరెల్మాన్ పుస్తకం "లైవ్ మేథమెటిక్స్"; ఎల్. వ్లాసవ్, డి. త్రిఫోనవ్‌ల పుస్తకం "కెమిస్ట్రీ మేడ్ యీజీ"ని కన్నడంలో అనువదించారు.

1987 లో రాదుగా ప్రచురణాలయం, భారతీయ సంస్థ రాజ్ పాల్ అండ్ సన్స్ సంయుక్తంగా "లింక్స్" కలెక్షన్ పేరుతో ప్రచురించిన పుస్తకాలు సోవియట్ - భారత మైత్రీ చరిత్రలోని ప్రత్యేకాంశాన్ని తెలియజేస్తున్నాయి. ఈ ప్రచురణల్లో ఉభయ దేశాల సంబంధాలపై సోవియట్, భారతీయ రాజనీతిజ్ఞుల రచన లున్నాయి: వారు వ్లదీమిర్ లెనిన్, మహాత్మాగాంధీ, జవహర్ లాల్ నెహ్రూ, ఇందిరా గాంధీ, మిహయీల్ గొర్బచేవ్, రాజీవ్ గాంధీ. లియో టాల్‌స్టాయ్ మహాత్మా గాంధీ మధ్య, మాక్సిం గోర్కీ, భారతీయ విప్లవకారుల మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు భారతీయ పాఠకులకు ఆసక్తిదాయకంగా వుంటాయనడంలో సందేహం లేదు. "లింక్స్" ప్రచురించిన పుస్తకాల్లో ఎన్. తిఖనోవ్. అమృతా ప్రీతమ్, ఎ. కెషొకోవ్, శ్యామ్ బెనిగల్, ఆర్. గమ్జతోవ్, సత్యజిత్ రాయ్ రచనలు వున్నాయి.

భారతీయ అధ్యయనాలపై నవూక ప్రచురణాలయం ప్రతియేటా సుమారు 20 పుస్తకాలను ప్రచురిస్తోంది.

ఇప్పటికి కొన్ని సంవత్సరాలుగా సోవియట్ విజ్ఞాన శాస్త్రాల అకాడమిలోని ప్రాచ్య అధ్యయనాల ఇన్‌స్టిట్యూట్ సహకారంతో నవూక ప్రచురణాలయం ఇండియన్ ఇయర్ బుక్‌ను ప్రచురిస్తోంది. "ఇండియా 1985-1986" ఇయర్ బుక్‌ను 1987 లో ప్రచురించారు. ఇందులో భారతదేశానికి సంబంధించిన అనేక అంశాలపై సోవియట్ ప్రముఖుల వ్యాసాలున్నాయి.

ఇదే ప్రచురణాలయం "హిందూయిజం. ట్రెడిషన్స్ అండ్ మోడ్రన్ లైఫ్" అనే శీర్షికతో ఒక సంకలనాన్ని, "ది రోల్ ఆఫ్ హిందూ యిజమ్ ఇన్ ది ఐడియలాజికల్ స్ట్రగుల్ ఆఫ్ మోడ్రన్ ఇండియా" అనే ఓ. మెజెన్‌త్సెవా పుస్తకాన్ని ప్రచురించింది.

"ఎస్సేస్ ఆఫ్ ది హిస్టరీ ఆఫ్ యీస్తటిక్ థాట్ ఇన్ ఇండియా ఇన్ న్యూ అండ్ రీసెంట్ టైమ్" అనే నవూక ప్రచురణాలయం ప్రచురించిన యీ కొత్త పుస్తక రచయిత ఐ. షెపత్సోవా.

సోవియట్ - భారత అధ్యయనాల్లో భారతీయ భాషా శాస్త్రం బాగా అభివృద్ధి చెందిన రంగాల్లో ఒకటి. సోవియట్ యూనియన్‌లో భారతీయ భాషల; సాహిత్యాల అధ్యయనాలకు సుసంపన్నమయిన దీర్ఘకాలిక సాంప్రదాయాలున్నాయి. వీటిని యిటీవలి నవూక ప్రచురణలు మరింత అభివృద్ధి చేశాయి. ఉదాహరణకు అది ప్రచురించిన "లిటరేచర్, కల్చర్ ఆఫ్ ఏన్షియంట్ అండ్ మిడీవల్ ఇండియా" అందులో ఒకటి.

"రైటర్స్ అండ్ సైంటిస్ట్స్ ఆఫ్ ఓరియంట్" అనే శీర్షికతో యిప్పటికే 30 కి పైగా పుస్తకాలను ఈ సంస్థ ప్రచురించింది. కాళిదాసు, ఇబ్నసినా, నిరాలా, సరోజిని నాయుడు, విద్యాపతి, భర్తృహరి, కిషన్ చందర్, ముల్క్‌రాజ్ ఆనంద్ రచనల గురించి వీటిలో పేర్కొన్నారు. ఈ పుస్తకాల పరంపరలో సుమిత్రానందన్ పంత్‌పై ఇ. చెలిషేవ్, మిర్జా గాలిబ్‌పై ఎన్. ప్రిగారినా చేసిన రచనలు వున్నాయి. "గాలిబ్ మహత్తర కవితా ప్రతిభ, ఉజ్జ్వలమైన అద్వితీయమయిన ఆయన వ్యక్తిత్వం యివి 19వ శతాబ్దపు భారతీయ సాహిత్య, ప్రజా జీవనంలో ఆయనను ప్రముఖ వ్యక్తుల్లో ఒకనిగా చేశాయి. భావితరాల రచయితలపై

ఆయన ప్రగతిశీల భావాల ప్రభావం యెంతగానో వుంటుంది" అని ఎస్. ప్రిగారినా పేర్కొన్నారు.

మన ఉభయదేశాల. ప్రజల మధ్య గల చారిత్రక సంబంధాలకు సోవియట్ ప్రచురణ సంస్థలు అధిక ప్రాధాన్యత నిస్తున్నాయి. 1987 లో అవి "రష్యా అండ్ ఇండియా". "యు.ఎస్ ఎస్.ఆర్. అండ్ ఇండియా" అనే రెండు పుస్తకాలను వెలువరించాయి.

ప్రతి సంవత్సరం సోవియట్ యూనియన్, భారతదేశ రాజకీయ ప్రముఖులపై పుస్తకాలను ప్రచురిస్తోంది. 1987 లో నవూక ప్రచురణాలయం ఎ. వాఫ, ఎ. లిట్మన్‌లు రచించిన "ది ఫిలసాఫిక్ వ్యూస్ ఆఫ్ జవహర్‌లాల్ నెహ్రూ" అనే పుస్తకాన్ని ప్రచురించింది.

జవహర్‌లాల్ నెహ్రూ తాత్విక అభిప్రాయాలను తెలిపే పుస్తకం వెలువడక ముందే "త్రీ లీడర్స్ ఆఫ్ ది గ్రేట్ ఇండియన్ పీపుల్" అనే ఆర్. ఉల్యనవోస్కీ రచించిన పెద్ద పుస్తకాన్ని పొలిటిచెస్కయా లితరాతురా పబ్లిషర్స్ (మాస్కో) ప్రచురించింది. ఇందులో మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ, ఇందిరా గాంధీలపై రచించిన వ్యాసాలున్నాయి. భారతదేశ సామాజిక, రాజకీయ ఆర్థిక సమస్యలపై పరిశోధనచేసిన ప్రొఫెసర్ ఆర్. ఉల్యనొవోస్కీ సుపరిచితుడే. యీ కృషిని ఆయన యిప్పటికి 50 యేళ్ళుగా చేస్తున్నారు.

సోవియెట్, భారతదేశ పాఠకుల కోసం యిటీవల సోవియట్ యూనియన్ ప్రచురించిన ప్రధాన పుస్తకాలు యివి. □

---


Statement about ownership and other particulars about Newspaper SOVIET SAMEEKSHA - (Telugu)

Form IV

*( See Rule 8 )*

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | ... 115, Theagaraya Road, Madras-600 017. |
| 2. | Periodicity of its Publication | ... Monthly |
| 3. | Printer's Name | ... A.N. KAZANTSEV |
| | (Whether citizen of India ?) | ... No. |
| | (If foreigner, State the country of origin) | ... USSR |
| | Address | ... 115, Theagaraya Road, Madras-600 017. |
| 4. | Publisher's Name | ... A.N. KAZANTSEV |
| | (Whether citizen of India ?) | ... No. |
| | (If foreigner, State the country of origin) | ... USSR |
| | Address | ... 115, Theagaraya Road, Madras-600 017. |
| 5. | Editor's Name | ... Y.L. FROLOV |
| | (Whether citizen of India ?) | ... No. |
| | (If foreigner, State the country of origin) | ... USSR |
| | Address | ... 25, Barakhamba Road, New Delhi-110 001. |
| 6. | Names and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | ... Information Department of the USSR Embassy in India, 25, Barakhamba Road, New Delhi-110 001. |

I, A.N. KAZANTSEV, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) A.N. KAZANTSEV
Signature of Publisher

Date : 29-2-1988

ఎస్తోనియన్ కార్టూనిస్టు ఎ.ప్రైస్టిర్ గీసిన సృజనాత్మక,
సాంప్రదాయక కార్టూన్లు.





# ఇండో - ఇరానియన్ ప్రాచీన నగరం

అది ట్రాయ్ కన్నా వెయ్యేళ్లు ప్రాచీన నగరం, అద్భుత నగరం. ఆ నగర నడిబొడ్డున వర్తులాకార చౌకు వుంది. ఆ చౌకు నుండే నగరమంతటికీ సూర్యకిరణాల్లా చొచ్చుకుపోయే వీధులు. ఆ నగరానికి రెండు వరుసల్లో కోట గోడలున్నాయి. యిదీ ఆ నగరంపై విహంగ దృష్టి సారిస్తే కనిపించే దృశ్యం.

ఛెల్యాబిన్స్క్ యూనివర్శిటీ అసోసియట్ ప్రొఫెసర్ జి. జ్దానోవిచ్ యీ నగరం గురించి తెలియ జేసినదిదీ:

"యధాతధంగా, చెక్కు చెదరకుండా బయట పడిన మొట్టమొదటి నగరమిది. యిది ఇండో — ఇరానియన్ సాంస్కృతిక కట్టడమని యిక్కడ లభించిన పింగాణీ పాత్రలు, కంచు కొడవళ్లు, పోత పాత్రలు తెలియజేస్తున్నాయని పురాతత్వ శాస్త్రవేత్తల అభిప్రాయం.

"యీ తవ్వకాలను పూర్తి చేయడానికి కనీసం ఐదు సంవత్సరాలు పడుతుంది. యివి చరిత్రకు మరో పుటను చేర్చవచ్చు. అయితే మాకు ఐదు సంవత్సరాల గడువు లభిస్తుందా? యీ నగర మున్న ప్రదేశం జలాశయం నీటిలో మునిగిపోనున్నది. ఈ తవ్వకాల్లో గొప్ప చారిత్రక విలువగల విషయాలు బయటపడవచ్చునని అకడమీషియన్ పయిత్కోవ్‌స్కీ, రిబకోవ్ తదితర శాస్త్రజ్ఞుల అభిప్రాయం."

## ప్రత్యేక సమాచారం

జార్జియా రాజధాని అయిన త్బిలిసీ నివాసి రమాన్ కిహేలి భారత్‌ను ఎన్నడూ సందర్శించలేదు. ఆయన స్వయం కృషితో యోగాభ్యాసాలు చేసి అందులో ప్రావీణ్యతను సంపాదించుకొన్నాడు.



## ఏడు దశాబ్దాల సోవియట్ పెయింటింగులు

అర్మీనియన్ చిత్రకారుడు మర్తిరోస్ సర్యాన్ చిత్రాలు కనువిందు చేస్తాయి. ఆయన పెయింటింగ్‌లు, — ప్రజలు, ప్రకృతి, నగరవీధులు, యిళ్లు, చెట్లు, పువ్వులు, పళ్లు — ఏవైనాసరే, చాలా అందంగా, మిలమిలా మెరుస్తూ వుంటాయి.

"చిత్రాలు జీవితానికి అద్దంపట్టాలి; ప్రజలను పుత్తేజపర్చాలి; అవరోధాలను అధిగమించడానికి ధైర్యసాహసాలను వారి హృదయాల్లో నాటాలి" అంటారాయన. తన చిత్ర కళకు సంబంధించి సర్యాన్ పెట్టుకొన్న లక్ష్యం యిదీ.

టూకీగా



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KRSA102M272 |
| --- | --- |
| పుస్తకం పేరు | వీక్షణం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |